తొలికూర్పు

1955

ముద్రణ :

సుందరీ ప్రెస్,

విజయవాడ.

వెల : రూపాయి

సంపాదకుడు

గద్దె లింగయ్య

# ఆస్తి కోసం

రాధతల్లి చనిపోయినప్పుడు రాధకి యెనిమిదేళ్ళు. ఆ వూరు ఎలిమెంటరీ స్కూల్లో నాలుగోక్లాసు చదువుతున్నది. సాయంత్రం బడినించి రాగానే, వాకిట్లోవుండగానే యేడుపులు వినపడ్డాయి. రాధ ఎందుకేడుస్తున్నారో అనుకుంది. తీరా దగ్గరకొచ్చి చూచేప్పటికి అమ్మమ్మ అత్తయ్య దగ్గరకూచుని యేడుస్తున్నారు. అమ్మమీద గుడ్డ కప్పబడి వుంది. రాధనిచూచి యేడ్పులు మరీ యెక్కువైనయ్. రాధ తల్లిని కావిలించుకొని బావురుమన్నది, తాతయ్య స్తంభానికి చేరగిలబడి కళ్ళవెంట నీళ్ళుకారుస్తున్నాడు. తల్లికడుపునపడ్డ యేడునెల్లకి రాధతండ్రి చనిపోయాడు, అందువల్ల తండ్రిని రాధ యెరుగదు.

పదిహేడోరోజున గామోసు అత్తయ్య తనవూరు వెళుతూ అన్నది- రాధతల నిమురుతూ —'ఇక తలిదండ్రులూ, తాతముత్తవలూ మీరే! మీ చేతులమీదుగానే అది పెరిగి పెద్దదై సంసారాన్ని దిద్దుకోవాల్సివుంది. దేముడు అలా రాసిపెట్టాడుగావును— పిల్ల భూమిమీదపడకముందే తండ్రి గతించటం, మరి యెనిమిది సంవత్సరాలకు తల్లికూడా చనిపోవడం' తాతయ్యా, అమ్మమ్మా కంటతడిపెట్టుకున్నారు. రాధ పెద్దపెట్టున యేడ్చింది.

ఆపిల్ల తాతయ్య కంటతడిపెట్టటం చూసిందంటే యేదో విపత్తు సంభవించిందని, తనుకూడా ఆవిపత్తులోని విషాదాన్ని

పంచుకోవాలని ఖేదపడేది. తండ్రిలేని కారణంగా మొదట్నుంచీ ఆ లోపం సమసిపోయేట్లు తాతయ్య చేతుల్లో పెరిగింది. తాతయ్యకి ఆడపిల్లలంటే అమ్మమ్మకంటేకూడా మహాయిష్టం; అందుచేత రాధతల్లిని యెంతో గారాబంగా పెంచాడు. చివరకు అది ఫలించకపోవటంతో ఆ ప్రేమంతా మనుమరాలి క్షేమంకొరకు మళ్ళింది.

తాతయ్యకి యాభైఎనిమిదేళ్ళు. తాను ఇంకా కనీసం ముప్ఫైయేళ్ళయినా బ్రతుకుతాడని తాతయ్య దృఢవిశ్వాసం. అదీగాక తాతయ్య చిన్నప్పట్నుంచీ ఒక రోగంతో తీసుకొని కానీ, ఒక తలనొప్పితో బాధపడి కానీ యెరుగడు. మనిషిలో ఇంకా కండపుష్టి, అవయవపటుత్వమూ బిగువుగా నేవున్నాయి. అమ్మమ్మ తన జీవితంలో ఒక్క రాధతల్లి నేకన్నా బలహీనంగా వుంటుంది. అప్పుడే పళ్ళన్నీ వూడిపోయినవి.

తాతయ్యకి యెనిమిదెకరాలపొలంవుంది. రాధతండ్రి పేర నాలుగెకరాలపొలంవుంది. ఈమొత్తం పన్నెండెకరాల పొలం, రెండువాములదొడ్లూ, దిట్టమైన యిల్లూ వల్ల తన మనమరాలిజీవితసౌఖ్యానికి ఎటువంటి విఘాతమూ కలగదని నిశ్చయించుకున్నాడు. ఆవూళ్ళో తాతయ్యకి కాస్త పలుకుబడి వున్నది. అది వంశానుసారంగా వొచ్చిన పలుకుబడే అయినా తాతయ్య తన హయాములో దాన్ని కాపాడుకొంటూవచ్చాడు.

రాధ ఎల్లప్పుడూ ఆనందంగా వుండేట్టు, తల్లిదండ్రులు లేని లోపాన్ని మరచిపోగలిగేట్టు పోషించుతూ వచ్చాడు, తాతయ్య. చక్కని దుస్తులు — రాధనిబజారుకు తీసుకెళ్ళి

ఆమెకు నచ్చినవి — కడకు ఎంత ఖరీదు వైనా సరే కొని, పరికిణీలు, వోణీలు, గౌన్లు, చొక్కాలు కుట్టించేవాడు. రోజూ చిరుతిండి తెచ్చిపెట్టేవాడు. వూళ్ళోకివచ్చిన కొత్త సినిమాకల్లా తీసుకెళ్ళి చూపించేవాడు. బస్తీకి వెళ్ళితే వొచ్చే ప్పుడు రంగురంగుల బొమ్మలూ, ఆటవస్తువులూ, కొను కొచ్చేవాడు. వీటిల్లోపడి రాధ చదువు మరిచిపోయింది. చదువంటే ఒక రకమైన గుదిబండ అనిపించింది. ఒక రోజున తాతయ్యతో 'నాకు చదువొద్దు తాతయ్యా!' అంది. తాతయ్య 'పోనీలేమ్మా! అలాగే —' అన్నాడు. ఎలాగైనా ఆడపిల్ల లకి చదువు యెబ్బెట్టుగానేవుంటుంది అనేరకంలోవాడు. రాధ ఆరోతరగతి మధ్యలో మానేసింది.

తాతయ్య పొలం పాలుకి యిచ్చాడు. అందుచేత ఎప్పుడూ యింటిదగ్గరే మనుమరాలికి ఆకబుర్లూ యీకబుర్లూ చెబుతూ నవ్విస్తూ, తాను తృప్తిపడుతూ కాలాన్ని వెళ్ళ బుచ్చేవాడు. అప్పుడప్పుడూ భాగవతమో, భారతమో తీసి చదువుకొనేవాడు. మధ్యలో మనుమరాలొచ్చి 'రా, తాతయ్యా! బొమ్మలపెళ్ళి చూద్దువుగాని' అనో, 'ఒక పిట్ట కథ చెబుదూ' అనో అంటే చివుక్కునలేచి రాధకోరిక నెర వేర్చేవాడు.

రాధకి తల్లిపోలికలే. చాలా అందంగా వుండేది. ఎదుగు తున్నకొద్దీ ఆమెముఖం చంద్రబింబంలాగా కావటం, శరీరంలో మెరుగులు కనబడటం, చలాకీతనంతగ్గి క్రమేణా అదోరకమైన సిగ్గూ, బిడియమూ, వ్యక్తిత్వం యేర్పడడమూ తాతయ్యలో

హుషారును, అఘోరకమైన గర్వాన్ని రేకెత్తించేందుకు దోహద మిస్తున్నాయి.

ఈ సమయంలో అమ్మమ్మ మంచానపడింది. తాతయ్య భయపడ్డాడు. అనుకొన్నంతా జరిగింది. మంచానపడ్డ తొమ్మిది రోజులకు అమ్మమ్మ చనిపోయింది. తాతయ్యకి మరో విపత్తువచ్చి పడ్డది. భగవంతుడు తనయందు కోపభావాన్ని పూనాడనుకొన్నాడు. రాధ భవిష్యత్తునితలచుకోగానే వొళ్ళుపులకరించింది. తానుమట్టుకు ఎన్నిరోజులు బ్రతగ్గలదు? తనకన్నా చిన్నది చావలా! తాతయ్యకి చూస్తూ చూస్తూండగానే కాకతాళీయంగా తను చావవలసివస్తుందేమో అన్న సందేహం బాధిస్తోంది అమ్మమ్మమరణంతో. రాధకి తనతల్లి మరణం, తనకు తెలీకండానే తండ్రిమరణం స్ఫురణకువచ్చి చాలారోజులు బాధపడింది. ఇప్పుడు ఈ పన్నెండు సంవత్సరాల వయస్సు వొచ్చింతరువాత రాధకి బాధపడటం అంటే ఎటువంటిదో – ఈ అకాలమరణంవల్ల తనజీవితం ఎటువంటి గతుకుల దారిలో పడుతుందో – అన్న ఆలోచనలు కలుగుతున్నవి. తనను గురించి తాను ఆలోచించుకోవటం, రాధ కిదే మొదలు. అంతవరకూ రాధజీవితం ప్రమోదంలోనే గడిచిపోయింది. ఈ ఆలోచనలు రావటంవల్ల తన భావినిగురించి తాతయ్యగూడా కష్టపడుతున్నట్టు గ్రహించగలుగుతున్నది.

తాతయ్యమీద రాధకి ఎంతప్రేమో చెప్పాలంటే రాధమీద తాతయ్యకి ఉన్నంతప్రేమా వుందని చెప్పాలి. తాతయ్యే లేకపోతే తనజీవితం యింతసుఖవంతంగా ఉండదనీ, ఆస్తివున్నా. యెక్కడో అక్కడ వెట్టిచాకిరీ చేయాల్సివొచ్చే

దని, ఒకళ్ళక్రింద బ్రతకటంతో తనజీవితం ఆశలతోనే పూర్తయ్యేదనీ — వూహించుకున్నప్పుడు రాధకి తాతయ్య మీాద మక్కువ యెక్కువయ్యేది. పాపం! తల్లిదండ్రులు లేనిపిల్ల! తనూ ముసలివాడే, కర్మవశాత్తు తనుకూడా ఈ బూడిదలో కలిసిపోతే ఇంకేముంది ఆ పిల్లగతి? ఎంతఆస్తి వుండిమట్టుకు యేంప్రయోజనం? అవతలా ఇవతలా తనవాళ్ళనేవాళ్లు అండ లేకపోయినప్పుడు — అని అనుకొన్నప్పుడు తాతయ్యహృదయం అల్లల్లాడి రాధమీాద అంతంలేని ప్రేమా, రాధజీవితాన్ని ఎన్నెన్నో కష్టనష్టాలకోర్చి ప్రమోదప్లావితం చేయాలనే పట్టుదలా ద్విగుణీకృతమయ్యేవి. అమ్మమ్మ చనిపోయిన తరువాత రాధ అధికంగా దిగులుపడుతున్నదని గ్రహించినవాడై తాతయ్య —'ఏంతల్లీ! దిగులుపడుతున్నావా? వద్దు. నీ మనసులో యేవిధమైన దిగులూ పెట్టుకోవద్దు. ఇంకా ఈ ముసలివాడు వుండగా నీకు ఎటువంటి ఆపదలూ సంభవించవు. నీ జీవితాన్ని సక్రమమార్గంలోకి తేవటానికే ఈ ముసలివాడి ఆలోచనలూ, తాపత్రయమూ, చేతలూనూ. నీకోసమై ఈ జీవితాన్ని నేను యెన్నడో అంకితంచేశాను. నీ జీవితం స్థిరపడేవరకూ ఈ జీవితం నశించకుండా ప్రయత్నిస్తాను. ఈ వూళ్లో మనకు శత్రువులు లేరు. అందరూ మన శ్రేయస్సును కాంక్షించేవాళ్ళే.' ఈ మాటలు పైకి ధైర్యంగా అంటోన్నా తాతయ్య లోపల లోపల భయపడుతున్నాడు. అలా భయపడటం కేవలం పిరికితనాన్ని కొనితెచ్చుకోవడమే అవుతుందని నిశ్చయించుకున్నాడు. ఇలా చెప్పడంవల్ల రాధకు కొంతధైర్యం యేర్పడుతుందనీ, మనోవ్యధ దిగజారుతుందనీ'

ఆశించి అన్నాడు తాతయ్య. కాని ఇందుమూలంగా రాధకు తనజీవితంమీద జుగుప్స ధ్వనిస్తున్నది. తనకోసం, తనక్షేమం కోసం తాతయ్య తన జీవితాన్ని అర్పించడంలో — అర్పించాలని ఉబలాటపడటంలో అన్యాయమున్నదని మనస్సు వాపోతున్నది. అది తాతయ్య ప్రేమవల్ల నే కావొచ్చు. దగ్గరిసంబంధ కారణమే కావొచ్చు. ఎవ్వరూ దిక్కులేకపోవటంవల్ల వుద్భవించే కరుణే కావొచ్చు కాని అందుకు రాధ లేతహృదయం వొప్పుకోవటంలేదు. మరీ వ్యధ చెందుతున్నది. 'తాతయ్యా—' అన్నది. ఆమాట అన్నప్పుడు రాధగొంతు గద్గదికం అయింది. కళ్ళవెంట నీళ్లుకూడా రాలినయి.

'ఏంతల్లీ—' తాతయ్య తల వొంచుకుని అన్నాడు.

ఇహ యేమీ అనలేకపోయింది రాధ.

'నాకోసం నీవు కష్టపడడం బాగాలేదు, తాతయ్యా!' అన్నది. ఆ అన్నప్పుడు ఆమె హృదయంలోని దడదడ తాతయ్యకే అవగాహనం అయ్యింది.

'పిచ్చితల్లీ! నీ కింకా తెలీదమ్మా! ప్రపంచంనడక ఏవిధంగావుందో తెలుసుకొనే పరిజ్ఞానం నీలో ఇంకా ప్రవేశించలేదమ్మా! అలా నువ్వు అనుకోవాకు. నా జీవితం అలా నీకోసం అంకితమైతేగాని నీ జీవితంలో స్థిరత్వమేర్పడదు. నాకు వయస్సు వొచ్చేసింది. ఇంకా ఎక్కువకాలం బ్రతకను. అన్ని సౌఖ్యాలూ అనుభవించాను. నువ్వొ చిన్నదానివి. ఇంకా అనుభవాలులేవు' అన్నాడు తాతయ్య, తనమనుమరాలు తను బాధపడటంయిష్టంలేక అలాఅంటున్నదని నిర్ణయించుకొని.

తాతయ్య లైబ్రరీనించి పుస్తకాలు పట్టుకొచ్చి రాధ చేత చదివించడం ఆరంభించాడు. మ్యాగజైన్లుకూడా తెచ్చేవాడు. రోజూ యింటికి దినపత్రిక వస్తుంది. తను చదవటం కాగానే రాధకిచ్చేవాడు. ప్రక్కింటి కృష్ణారావు రేడియో తెప్పించాడు. కొన్ని రోజులు పోయింతరువాత రాధ దాన్ని తీసుకురమ్మన్నది. తాతయ్య బస్తీకివెళ్ళి నాలుగువందల మున్ఫైఅయిదు రూపాయలుపెట్టి దాన్ని తీసుకొచ్చాడు. ఇప్పుడు రాధకి బాగా కాలక్షేపం అవుతున్నది. తాతయ్య కూడా రేయింబగళ్లు రేడియోవింటూ కూర్చునేవాడు.

92362 2

రాధ పెద్దమనిషయింది, పధ్నాలుగోయేడున. తాతయ్య బంధువుల్ని పిలిపించి వాళ్ళసహాయంతోటీ, ప్రక్క యిళ్ళవాళ్ళ సహాయంతోటీ దిట్టంగా బంతులు పెట్టించాడు. చుట్టాలందరికీ వెళ్ళేప్పుడు గుడ్డలుపెట్టాడు.

పెద్దమనిషైన తరువాత సహజంగా ఆడపిల్లల్లో వొచ్చే మార్పె రాధలో వచ్చింది. పిల్ల కొంచెం లావైంది. పొడుక్కు లావుసరిపోవటం మూలాన శరీరం నునుపుకు తిరగటంచేత, అసలే రాధ అందమైనది కావటంవల్ల — రాధ గొప్ప సౌందర్యవతి అయింది.

తాతయ్యకు రాధకిపెళ్ళిచేసి ఒక యింటిదాన్ని చేయాలనే ఆలోచన కలిగింది. ఆ ఆలోచనతోపాటు తాతయ్యలో ఒక ఖేదంగూడా బయలుదేరింది — ఈ పెళ్ళివల్ల మనుమరాలికీ తనకీ యెడబాటు కలుగుతున్నదే అని. ఈ విచారం సబ

వైబెందికాదు. కాని — అయినా తాతయ్య ఎక్కువ విచారపడ లేదు. తాతయ్య వరాన్వేషణ సాగించాడు. రాధ పెళ్ళివిషయంలో తాతయ్య తీర్మానించుకున్న విషయాలు కొన్ని వున్నవి. మొదటిది, వరుడు పిల్లకి నచ్చాలి — తనకు నచ్చటం ముఖ్యం కాకపోయినప్పటికీ. రెండోది ఆ వరుని నడత, వంశం, స్థితి. మూడోది వరుడు తనయింట్లో వుండాలి. ఈ అన్ని హంగులూ గలవరుడు దొరికేవరకూ వివాహానికి ఆగాలి అనుకున్నాడు.

తాతయ్య చాలావూళ్ళుతిరిగాడు. కాని తగినవరుడు దొరకలేదు. సంవత్సరంన్నరగడిచింది. పిల్ల బాగా యెదిగింది. తాతయ్య వరుళ్ళకోసం వెతుకుతూనే వున్నాడు. కొన్ని సంబంధాలు యింటికే వొచ్చినవి. వాటిల్లో ఆస్థి తక్కువద్యో, యిల్లరికం రుచించకో, వంశంచెడ్డదయ్యో తిప్పికొట్టేశాడు.

వుండి వుండి రెండునెల్లు గడిచింతరువాత ఒక సంబంధం వొచ్చింది. అన్ని హంగులూవున్నవి కాని, ఒకటిమాత్రం లోపంకనపడింది. వాళ్ళకి ఒక్కడే పిల్లవాడట. అతనువచ్చి మాత్రం యిక్కడస్థిరంగావుండడట. వరుడు పిల్లకి బాగా నచ్చాడు. అవతల బంధువుల వొత్తిడి అధికమైంది. పిల్ల యెదిగిపోతున్నది. యేళ్ళు మించినవంటే పెళ్ళికావటంకష్టం అనిగూడా అన్నారు. అదీగాక ఈ తిరగటంవల్లనో యేమో తరుచూ తాతయ్యకి దగ్గువొస్తున్నది. అందుచే ఆ లోపాన్ని లోపంగానే వుంచి, పెళ్ళికి వొప్పుకున్నాడు తాతయ్య. నాలుగెకరాలు కట్నం యిచ్చాడు.

పెళ్ళి వైభవోపేతంగా జరిగింది. బట్టలు యిచ్చిపుచ్చు కోవటంలోనూ సక్రమంగా నేజరిగింది. పిల్ల అత్తవారింటికి వెళ్ళింది. తాతయ్యకి గొప్ప దిగులేసింది. మూడురోజులు రాధని చూడకుండా వుండేప్పటికి తాతయ్యహృదయం తహ తహలాడింది. పరిపరివిధాలపోయింది మనసు. చుట్టాలుకూడా వెళ్ళిపోయారు. ఇక ఎటొచ్చీ వండిపెట్టే పనిమనిషీ, తనే. లంకంతయిల్లూ బావురుమంటున్నది. రేడియో చేసే గోల ఆ యిల్లును సదండిగా వుంచలేకపోతున్నది. ఎప్పుడూ యింట్లో కూచొని పురాణగ్రంథాలు చదవలేకపోతున్నాడు.

నెలలో రెండుసార్లు రాధదగ్గరకు వెళ్ళివచ్చాడు. రాధ కులాసాగా వున్నట్టు కనపడింది. తాతయ్యని చూడకపోతే ఆమెమనస్సు చీకాకుగానే వుందట.

ఒకరోజున తాతయ్యకు ఒకఆలోచన తట్టింది. 'తను యింకా యింత సంపాయించేది దేనికి? మనుమరాలి కోస మేగా? అంతకాడికి తనుకూడా మనుమరాలితోపాటు వుంటే కవ్రులువచ్చే ఆ పదిరోజులూ ఇక్కడికొచ్చి వుండవొచ్చుగా. ఈ ఆలోచన మంచిదిగానే తోచింది కాని, ఎక్కడో గౌరవా నికి దెబ్బతగులుతున్నట్టు తోచింది. తాతయ్య యింత తక్కువ ఆలోచనకి దిగటానికి కారణం అతను అంతకంతకూ మనుమ రాలు దూరంగావుండటం సహింపలేకనే.

ఈ సందిగ్ధావస్థలోనే రెండునెల్లు గడిచినవి. ఈలోపల అయిదుసార్లు రాధ దగ్గరకు వెళ్ళివొచ్చాడు. ఒకనాడు రాధ అత్తమామలు అన్నారు తాతయ్యతో – 'నువ్వు ఒక్కడవే అక్కడేంవుంటావు. యిక్కడే వొచ్చివుండు. పిల్లనుచూసు

కుంటూ వుండొచ్చు' అని. అదృష్టవశాత్తూ ఈమాటలు వాళ్ళు అన్నారు కానీ, అనకపోయినా ఎలాగూ పదిరోజుల్లో వచ్చి వుండేవాడే. తాతయ్య మంచిఅవకాశం చిక్కిందనుకొన్నాడు. మనుమరాలుకూడా రమ్మనే అన్నది.

ఇల్లు ఎవరో బ్రాహ్మలకు నెలకు పదిహేనురూపాయలకు అద్దెకిచ్చి తాతయ్య రాధదగ్గరకు వొచ్చాడు. ఇహ నిశ్చింతగా వుండొచ్చనుకున్నాడు. తాతయ్యకి యిప్పుడు పూర్తితృప్తి చిక్కింది. రాధజీవితాన్ని గురించి వున్న సమస్య అంత తేలిగ్గా పరిష్కారమవుతుందని అనుకొనివుంటే అప్పుడు అంత విచారపడివుండేవాడుకాదు. ఇప్పుడది తేలిగ్గా పరిష్కారమయ్యేప్పటికి అమితసంతోషపడుతున్నాడు. రాధ జీవితాన్ని ఒకదారిలోకి నెట్టగలిగానని — ఇకచనిపోయినా అంత వ్యధచెందాల్సిన అగత్యం లేదనుకున్నాడు. రాధమామ మంచివాడులాగానే కనిపించాడు తాతయ్యకి. రెండు పూటలూ కాఫీలు, ఫలహారాలు యిచ్చి, భోజనం పెట్టే వాళ్ళు. తాతయ్యకి వేరే ప్రత్యేకంగా ఒకగది యిచ్చారు. తాతయ్య యిల్లంతా తిరుగుతూండేవాడు, నవ్వుతూ, సంతోషంగా. వుగాకు వాళ్ళిచ్చినా, యివ్వకపోయినా తీసుకొనే వాడుకాదు. తనస్వంతడబ్బుతోనే కొనుక్కునేవాడు. బట్టలు కూడా తనే కొనుక్కొచ్చుకున్నాడు. తిండిగింజలు వాళ్ళు ఒద్దని యిదిచేసినా ఆరుబస్తాలు తనవూరునించి వేసుకొచ్చాడు, బండిమీద.

తాతయ్యకి ఒకనమ్మకంవుంది. తను కేవలం యిక్కడకు వొచ్చింది రాధని చూస్తూకూచోడానికే కాబట్టి, తిండికీ

గుడ్డకూ లోటుకలిగి రాలేదుకాబట్టి — వాళ్ళ ఐశ్వర్యాన్ని తను అనుభవించకూడదనీ — అలా అనుభవిస్తే ఎప్పటికైనా తక్కువ కావాలిసివస్తుందనీ, దెప్పిపొడుపుల్ని భరించాల్సి వొస్తుందనీనూ. సహం అందుచేతే తనకు అవసరమైనవాటిని తన డబ్బుతోనే కొనుక్కొంటున్నాడు.

# 3

సంవత్సరం గడిచింది. ఇప్పుడు తాతయ్యని రాధ మినహాయించి ఆయింట్లో సరిగ్గా చూచేవారు లేరు. క్షణక్షణం తాతయ్య ఈ విచారంతోటి క్రుంగిపోతున్నాడు. మొదట్లో ఎవర్నయితే మంచివాళ్ళుగా యెంచుకున్నాడో, ఎవరివల్ల పిలిపించబడ్డాడో, క్రమేపీ ఏకారణం లేకండానే, వాళ్లే తాతయ్యని ద్వేషించసాగారు. గమ్మత్తేమిటంటే తన అత్తమామలు, భర్త, తాతయ్యని ఎంతగా ద్వేషిస్తున్నారో రాధ తాతయ్యని అంతకు యినుమడించి ప్రేమిస్తున్నది. తనని పెద్దదాన్ని చేసి, తనసౌఖ్యాన్ని ఆయన జీవితలక్ష్యంగా యేర్పరచుకొని పాటుపడ్డతాతయ్యని తలుచుకున్నకొద్దీ రాధకి ప్రేమ వృద్ధిఅవుతున్నదేకాని క్షీణించటంలేదు

తనను బాధపెట్టి, తనని నీచంగా చూస్తే, అంతగా బాధపడేవాడు కాదు తాతయ్య. కాని రాధనికూడా దాసీలాగా చూడటంతో తాతయ్య మరీ యిదవుతున్నాడు. చూసి చూసి యిటువంటి మురికిగుంటలోకి త్రోశాడే తను — అని రాధముందు ముఖం పైకెత్తలేకపోతున్నాడు. దానిభర్తకు కూడా అదంటే సుహృద్భావం ఎందుకు యేర్పడలేదో అర్థం

కాలేదు. ఎప్పుడూ చిర్రుబుర్రులాడుతూంటాడు. అతగాడు విలాసపురుషుడు. ఆ వూళ్ళో చుక్కమ్మకూతురు వెంట పోయి, సరిగ్గా రాత్రులు యింటికి వొచ్చేవాడు కాదు.

ఒక రోజున రాధ అన్నది – 'రాత్రులు త్వరగా యింటికి రావటంలేదేమిటండీ?' అని.

ఆమాటకు ఇంత ఎత్తునలేచాడు. 'అయితే నీ భావం యేమిటి? ముండలతో పోతున్నాననా?' అన్నాడు. అంతటితో వూరుకుంటే బాగానేవుండేది. కాని తల్లిని పిలిచాడు. ప్రక్కగదిలోవుండి, తాతయ్య వింటూనేవున్నాడు. 'చూడవే, ఇది నామీద రంకుకడుతున్నది' అని చెప్పాడు తన తల్లితో. అతగాడు మహా అందగాడు. కాని హృదయం మెత్తనిది కాదు. భావాలు సంకుచితంగా వుంటవి. తల్లి అతని ఆరాధ్యదేవత. ఇతరుల్ని తనలోకి కలుపుకొనే సంస్కారం అతనిలో చదువు తక్కువకావటంమూలాన మృగ్యమైంది. ఈ సంగతిలో తాతయ్యకు అబద్ధాలు చెప్పారు.

రాధఅత్త మహారాకాసి. కోడల్ని బాధలుపెట్టటం. కోడలివేపువాళ్ళని తిట్టటము ఆమెకు పుట్టుకతో వొచ్చిందా వుషారు, అనిపిస్తుంది. 'ఓసిభడవా! నాకొడుకుమీద రంకుతనం మోపుతావా? నీకు గామోసు అటువంటి తుచ్ఛబుద్ధి. మీ వంశానికుంది గామోసు. ఎక్కణ్నుంచోవచ్చి నాకొడుకుమీద మోపుతున్నది.' తాతయ్య చెవులు మూసుకున్నాడు ఆమాటలకు. ఆయన శరీరమంతా చెమటలు పోసింది. ఏమనలేకపోయాడు. రాధ అక్కణ్నుంచి వెళ్ళిపోయింది.

తనే కనుక యిక్కడలేకపోయినట్లయితే ఇంకెన్ని బాధలు పెట్టేవాళ్ళో మనుమరాల్ని — అనుకున్నాడు, తాతయ్య. ఆరాత్రి తాతయ్యదగ్గరకు రాధ వొచ్చింది. "తాతయ్యా! మనం యిక్కడవుండి, వీళ్ళకి దాస్యంచేస్తూ మాటలుపడటం దేనికి ? మనం బ్రతకలేకవొచ్చామా ?" అన్నది, రాధ.

తాతయ్యకళ్ళవెంట నీళ్ళు జ ల జ ల రా లి న య్. 'తప్పమ్మా ! అలా అనకూడదు. ఎన్నిబాధలనైనా తాలిమితో సహించాలి. మనం వెళ్ళితే నిన్ను నీభర్త యేలడు. అప్రదిష్ట పాలవుతాం' అన్నాడు తాతయ్య. రాధ వెళ్ళిపోయింది. చివర కన్నాడు — 'నిన్ని నరక కూపంలోకి తోసింది నేనేనమ్మా!' అని.

'అలాగనకు తాతయ్యా. నాకర్మ' అని రాధ తనని తాను సంబాళించుకొంది.

తాతయ్య ఒకప్పుడు చాలా మర్యాదగానూ, నీతి గానూ బ్రతికినవాడు. ఇప్పుడతను ఒకళ్ళచేత మాటలు పడుతూ జీవించాల్సివొచ్చినా మనుమరాలి క్షేమంనిమిత్తం పెద్దగా బాధపడకండా గడుపుతున్నాడు.

ఇంట్లో అన్నిపనులూ రాధేచేయాలి. లంకంత యిల్లూ రాధే వూడవాలి. చెంబులూ, అంటుకుండలూ రాధే తోమాలి. అన్నం, కూరలు, కాఫీ, ఫలహారాలు, అన్నీ రాధే చేయాలి. ఇంకా పైగా, వీటితోనే కోడలిమీద కసి తీర్చుకోలేక ఆ అత్త 'పని శుభ్రంలేదు, పని తొందరలేదు' అని అధికారం చెలాయించుతూ వుంటుంది. ఈ పనుల భారం

వల్ల, తిండి సరిగ్గా అమరకపోవటంవల్ల రాధఆరోగ్యం బాగుండ టంలేదు. చిక్కిపోయింది. కళ్లు లోతుకుపోయినవి. వాళ్ళు ఒక చీరె పెట్టిందీలేదు. ఒకజాకెట్టు కుట్టించాలేదు తాతయ్య ఒకనాడు బస్తీకెళ్ళి మూడువందల రూపాయలుపెట్టి చీరెలూ, జాకెట్టుగుడ్డలూ తెచ్చాడు. కాని వాటిని సింగారించుకోవటా నికి రాధకు అనుమతి, తీరికా లేకపోవటం మరీ సహించ రానిదిగా తోచింది తాతయ్యకి. ఎప్పుడన్నా నీళ్లుపోసుకొని కొత్తచీరె, కొత్తజాకెట్టు కట్టుకుంటే ఆరంభమయ్యేవి అత్త గారి మూతివిరుపులూ, ఎత్తిపొడుపులూ — 'చేసింది, పనంతా! ఇప్పటిదాకా విరగబడింది. ఇక టింగుటంగుమంటూ చీర సింగారించి...' ఇటువంటివే మరికొన్ని. వీటిని భరించా లంటే రాధలో దాతృత్వం, ఓర్పు పూర్తిగా వుండివుండాలి. కాని, వున్నా అవి ఎల్లకాలమూ ఆమెలో పనిచేయలేక పోయినవి. ఆమెహృదయం ఇంతవరకూ సహించిన నీచత్వం, తాతయ్యప్రేమ — ఎదుర్కొన్నవి. ఆమెలోయింకిన గౌరవం, కోపం ప్రజ్వరిల్లినాయి.

తనవూరునించి పన్నెండుబస్తాల వడ్లు తోలుకొని కవులువాళ్లు వొచ్చారు యిద్దరు. ఆ పన్నెండుబస్తాలవొడ్లూ ఒక సంవత్సరానికిగాను సరిపడేవి తాతయ్యకి. పన్నెండు బస్తాలవడ్లు తాతయ్య వొక్కడే తినగలడా ? అంటే నిజానికి తినలేడు. అందులో అయిదుబస్తాలు సరిపోతవి. మిగిలిన యేడుబస్తాలు వండిపెట్టినందుకు, కూరలు చేసినందుకు. మళ్లా వండిపెట్టేది రాధే. ఎక్కడ వొచ్చిందంటే ఈ కీలకం — తను కష్టపడి వండకపోయినా రాధఅత్త చాటుగా — 'ఊఁ! మేమే

వండుకోలేక చస్తుంటే పైగా యిదీ. రోజూ ఇంకొకడికి వొండిపెట్టాలి.' అని గొణుక్కుంటూ వుండేది. అందుకనే తాతయ్య పన్నెండుబస్తాల వొడ్లు తెప్పించాడు.

వొడ్లు తోలుకొచ్చిన యిద్దరికీ అన్నంపెట్టాలి. వాళ్లు బీదతనంవల్లనేకాని కులంలో తాతయ్యకులమే. అంచాత వాళ్ళకి జీతగాళ్ళలాగ కూడుపెడితే కుదరదు. మర్యాద పోతుంది. పండుకోడానికి వరండాలో ఈతచాపవేస్తే గౌరవం కాస్తా మన్నుగలుస్తుంది. అయినా ఈ రెండూ జరిగినవి. అత్తగారి రుసరుసలవల్ల తాతయ్య క్రుంగిపోయాడు. అదే కాకుండా 'ఇప్పటికే పైమనిషికివొండిపెట్టాల్సివొస్తే బ్రహ్మాండ మవుతూంటే — అదిచాలక యింకా పైమనుషులు. మే మేమన్నా మనుషులమో కాదో!' అని అత్తగారు అనటం, మూతి వొంకరపెట్టటం తాతయ్య విన్నాడు. వొచ్చిన ఇద్దరుమనుషులూ విన్నారు. రాధ కళ్ళవెంట నీళ్లు పెట్టుకొంది. తనకీ తాతయ్యకీ జరుగుతోన్న తక్కువతనం వూళ్లో వాళ్ళకి తెలీటం రాధకిష్టంలేదు.

తెల్లవారి వాళ్ళని వూరి చివరవరకూ పంపించడానికి బండివెంట తాతయ్య వెళ్లాడు. అప్పుడు వాళ్లన్నారు 'ఎందుకు తాతయ్యా! యిక్కడవుండి వాళ్లచాత మాటలుపడటం? శుభ్రంగా మనవూళ్లో వుండరాదూ. నీకు ఏంజరగదుగనక' అని. ఇలా వాళ్లు అంటారని తాతయ్యకితెలుసు. ఆమాటలు వాళ్లనగానే తాతయ్యకి కళ్లవెంట నీళ్లురాలి చొక్కామీద పడినయ్. చీకటికాబట్టి అది వాళ్లు గమనించలేదు.

'మీకు తెలియదులేరా! నేనువుండేది నాకోసంకాదు. రాధకోసం' అని ఎలాగో అనగలిగాడు తాతయ్య.

రోజురోజుకీ తాతయ్యమీద ఎందుకో రాధఅత్తమామలకు ద్వేషం ప్రబలుతున్నది. వాళ్లు 'తనకోడలితాత' అన్న సంబంధాన్ని తమ మనస్సులనుండి తొలగించి చాలాకాలమయింది. వొడ్లుయిస్తే వండిపెడుతున్నామని అనుకోసాగారు.

ఒకరోజున రాధఅత్తవేపు బంధువు వొచ్చాడు. మూడు రోజులున్నాడు. ఈ మూడురోజులలో తాతయ్యనుచూసి ఒకసారి రాధమామని 'ఈయన ఎవరు?' అని అడిగాడు.

రాధమామ ముఖంచిట్లించుకొని — దిక్కులేనివాడు — వడ్లుయిస్తే వొండిపెడుతున్నాం' అన్నాడు.

తాతయ్య ప్రక్కనే వున్నాడు. వొళ్ళంతా చెమట పోసింది. తాతయ్య ఆ స్థితికీ, గౌరవానికీ ఇదొకదెబ్బ! మచ్చ! సహించలేకపోయాడు. వెంటనే లేచివెళదామని గదిలోకెళ్ళి గుడ్డలు సర్దాడు, అంతలో రాధ జ్ఞప్తికివచ్చింది. రాధని ఘోరారణ్యంలో అంధకారబంధురంలో విడిచిపెట్టి తనస్వలాభం చూసుకొని పారిపోతున్నట్లు అనిపించింది. వెంటనే గుడ్డలు వొదిలిపెట్టి చతికిలబడ్డాడు కుక్కిమంచంలో. రాధకోసం, రాధబాగుకోసం తనజీవితాన్ని అర్పించదలుచుకొన్న ప్రతిజ్ఞ జ్ఞప్తికివొచ్చింది.

* * * * *

## 4

తాతయ్యలో ఓర్పువుంది. ఆ ఓర్పే రాధ జీవితాన్ని బాగుపరుస్తుందని తాతయ్య తలంచాడు. అత్తగారింటిదగ్గర కోడలు సుఖించటం, దుఃఖించటం అనేది దైవాధీనం, అదృష్టం అనేవాటిమీద ఆధారపడివుంటవి — అనే అభిప్రాయానికి వొచ్చి అవిరెండూ పూర్వజన్మ పాపఫలితంగా రాధ జీవితంలో దూరానవున్నట్లు భావించక తప్పలేదు. ఇంత బ్రతుకూ బ్రతికి చివరికి వార్ధక్యంలో కాని చోటుకువొచ్చి అందరితో మాటలు పడుతున్నామే అన్న అవజ్ఞ తాతయ్యలో లేకపోలేదు. కాని దిగమింగుకొంటున్నాడు, వీలైనంతవరకు. తనబాధంతా, తన మనుమరాలి వ్యథంతా ఎవరితోనన్నా చెప్పకొంటే కొంత తగ్గుతుందనికూడా వుంది కాని, వాళ్ళుకూడా జోక్యంకలిగించుకొని యేమీ చేయలేరనికూడా తెలియటంతో మెదలకుండా వూరుకున్నాడు. లేకపోతే తనే స్వయంగా రాధ అత్తమామలతో సంప్రదించుదామని అనుకొన్నరోజులుకూడా వున్నవి. 'మీరు అమ్మాయిని అలా కష్టపెట్టటం భావ్యంకాదు. నాలుగెకరాల కట్నం యిచ్చింది మీకు వెట్టిచాకిరీ చేయటానికేనా! దానిదీ ప్రాణమే, మీదీ ప్రాణమే! ఇంకా అది చిన్నది. యే అనుభూతులూ లేనిది. ఈ వయస్సులో దానిని అన్ని పనులూ చేయమనటము సబబుకాదు. అత్తతో సుఖంగా వుండనివ్వండి. నే నిక్కడ అన్ని నానా కష్టాలూ పడుతూవున్నది అది చల్లగావుంటే చూసి ఆనందిద్దామనే. నాకు దాని ఆనందం తప్ప కోరవలసింది లేదు. మీరు అలా సుఖిస్తూ దానికి నరకం

చూపించటం మీా అవివేకమని, స్వార్థం అని సుస్పష్టంగా తెలుస్తున్నది. మీాకు చాలా ఆస్తి ఉన్నది. ఒకడు కాకపోతే నలుగురు పనిమనుషుల్ని పెట్టుకోవచ్చు. ఆస్తి యేమీా తరిగి పోదు' అని చూద్దామని ఆలోచించాడు, తాతయ్య. రాధతో కూడా చెప్పాడు. కాని అందువల్ల మరీ దుర్భరం అవుతుందని రాధ అన్నది. ఈ విషయం నలుగురితో చెప్పి తమని బజారు పాలు చేశారనికూడా అంటారు అనటంచేత తాతయ్య 'అంతా రాసివున్నట్టు జరుగుతుంది' అన్న వేదాంతంతో తృప్తిపడి వూరుకున్నాడు.

ఇలావుంటూండగా ఒకరోజున రాధకి జ్వరంవొచ్చింది. అది ఎవ్వరూ గమనించినట్టు కనబడలేదు. మూడురోజులు తీవ్రంగా వొచ్చింది. క్రమంగా వొళ్ళునొప్పులుకూడా ప్రాకి నయ్. వూళ్ళో మశూచికాలు అధికంగా వున్నయ్. తాతయ్య భీతిల్లాడు. అక్కడికీ కాస్తోకూస్తో పనులుచేస్తూనేవుంది, రాధ. డాక్టర్ను తీసుకురమ్మన్నాడు తాతయ్య, రాధ మామని. ఆపని తనకు సంబంధించనట్టు వూరుకున్నాడు. రాధభర్తతో చెప్పాడు, తాతయ్య. అతను — 'ఫరవాలేదు, దానంతట అదే పోతుంది' అన్నాడు నవ్వుతూ.

కాని మరునాడు మశూచికంలోకి దించింది. పూర్తిగా భయపడ్డాడు. తమాషాయేమిటంటే అంతకంటేకూడా యింట్లోవాళ్ళు భయపడ్డారు. రాధభర్త మేనమామయింటికి వెళ్ళాడు. రాధమామ తమ్ముణ్ని చూసిరావాలనే నెపం మీాద తప్పుకున్నాడు. రాధఅత్తకి ఎప్పుడో పదమూడో యేడప్పుడు మశూచికంచూపిందట. ఒకసారి మశూచికం

పోసినవాళ్ళకి తిరిగి పోయదనేనమ్మకంతోటి యిల్లువొదిలి పెట్టి ఎటూవెళ్ళలేదు అయినా రాధమంచందగ్గరకు రాలేదు. దేముడికి తమయందు ఈ ద్వేషభావం పోలేదని ఖేదపడ్డాడు తాతయ్య. కానిచోట ఈ కష్టాలేమిటి? అని క్రుంగిపోయాడు. ఈ వ్యాధితో రాధ మరీ యిద్దైంది. ఆమెకు ఉపచారంచేసేది ఒక్క తాతయ్యే. పదిరూపాయలు యివ్వవలసినచోట పాతిక రూపాయలు ఇచ్చి డాక్టర్ని కుదిర్చాడు, తాతయ్య. కాని ఏం లాభం? దురదృష్టవశాత్తూ ఆ పోతపోయటంకూడా ఒత్తుగా పోసింది. తాతయ్యలో 'రాధ బ్రతకదేమో' అన్న అధైర్యం, పిరికితనం ప్రవేశించింది. అయితే, దీక్షమాత్రం సడలలేదు. ఉపచర్యకు పనిమనిషిని పెట్టాలని చాలాచూచాడు, ఆ మాయదారి జబ్బునుచూసి అందరూ భయపడ్డారు. డబ్బు ఆశచూపించినా ఎవరూ లొంగలేదు.

వారం రోజులు గడిచినవి. రాధనిచూస్తోంటే తాతయ్యకి గుండెనురాయిచేసుకోవటం ఎలాగో అర్థంకాలేదు. ఈ వారం రోజులకుముందు అతను అన్నం యేమితిన్నాడో యేమో! అంతే – అసలు రాధ అత్త అన్నం వండుకుని తను మట్టుకు తాను తిన్నది కాని, తాతయ్యని పిలిచిందా? లేదు. ఒకటి రెండుసార్లు హోటల్లో తిని వొచ్చాడు. తాతయ్యకి నిద్రలేదు.

పదకొండో రోజుకు కాస్త నిమ్మళించింది. ఇరవై ఒకటోరోజు నీళ్ళుపోశారు. అప్పుడైనా రాధఅత్త అలావొచ్చి చూడలేదు. తాతయ్య డబ్బులిచ్చి పనిమనుషులచేత నీళ్ళు కాగబెట్టించి, నీళ్ళు పోయించాడు.

రాధ బ్రతికి భూమిమీద నిలుస్తుంది – అనే దాంట్లో తాతయ్యకి నమ్మకంలేదు. ఇప్పుడు బ్రతకటంవల్ల తాతయ్య మనసులో భగవంతుడికి వేయినమస్కారాలు పెట్టాడు. అయినా బ్రతికినట్టుకు...రాధ అవిటిది అయింది. ఆమశూచి కంట్లో ఒకకాలు కుంటిదైంది. అంటే కాలుపోయిందనికాదు. వంకరపోయింది. నడిచేప్పుడు ప్రక్కకేస్తుంది. ఆమెలో పూర్వం వున్న సౌందర్యమంతా మశూచికపుమచ్చలుపడి నశించింది. తెల్లగావున్న శరీరమంతా నల్లపడిపోయింది. పోతే తాతయ్యకి యిందువల్ల రాధమీద ఎటువంటి అసహ్యమూ కలగలేదు. కాని రాధకు ఎందుకుబ్రతికానా ? అనిపించింది. ముఖం అద్దంలోచూసుకుంటోంటే ఎక్కడలేని వెగటూ పడుతున్నది.

రాధభర్తా, మామా రాధకి నీళ్ళుపోశారని తెలిసి వొచ్చారు. తాతయ్యకి తెలుసు, తమకుకూడా ఆ జబ్బు అంటుకుంటుందేమోనన్న భయంచేత పారిపోయారని. రాధ ఆకారం చూడటంతోటే రాధభర్తకి వికారం కలిగింది. ముఖం చూసి పలకరించడానికే భయమేసింది.

రాధఅత్త మళ్ళీ ఆమెమీద అధికారం సాగించింది. ఆమె నడకచూసి గేలిచేయడం మొదలెట్టింది. ఇలా ఎగతాళి చేస్తోన్నప్పుడల్లా తను అప్పుడే చావక ఎందుకు బ్రతికానా ? అని నిందించుకొనేది రాధ. ఈ తీరున జీవించడం రాధకే కష్టమనిపించింది.

రాధ మళ్ళా మామూలు వెట్టిచాకిరీ చేయడం అంత శ్రేయస్కరంగా కనబళ్ళేదు, తాతయ్యకు. అందుచేత రాధ

అత్తతో అన్నాడు, ఒకరోజున – 'దానిచేత అన్నిపనులూ చేయించడం బాగుండలేదు. అసలే చచ్చి బ్రతికింది' అని.

'లేకపోతే నన్ను చేయమంటావా?' గయ్యమని లేచింది రాధ అత్త. తాతయ్య తగ్గలేదు. 'మిమ్మల్ని చేయమనికాదు. పనిమనిషిని పెట్టమని' అన్నాడు.

'కావాలిస్తే నీడబ్బుతో పెట్టుకో –' అన్నది ఆమె.

తాతయ్య అలాగేచేశాడు. కాని ఆపనిమనిషిని వుండనిస్తేనా? కూడు పెట్టక అడ్డమైనపనీ చేయించి, దాన్ని వెళ్ళకొట్టింది, రాధ అత్త. తాతయ్య యేమీ అనలేకపోయాడు. అయినా రాధతో పనిచేయించడానికి ఆయనహృదయం వొప్పడంలేదు.

రాధ భర్తకి రాధంటే ఎక్కడలేని జుగుప్స పుట్టుకు వొచ్చింది. ఆమెచేత మంచినీళ్ళు తెప్పించుకోవటంలేదు. ఆమె వున్న గదిలోకి వెళ్ళటంలేదు. దీన్ని సహించలేకపోతున్నది. ఏమనిపైతేమట్టుకు ఎన్నాళ్ళని విధిని నిందిస్తూ నిరాశని ఆరాధిస్తుంది ?

ఒక మధ్యాహ్నం భర్త గదిలోకి వెళ్ళింది. రాధ తన గదిలోకి రావటం ప్రళయం కలగటం సాదృశమనిపించినట్లు ఆయన ముఖం వ్యక్తంచేస్తున్నది.

'ఎందుకొచ్చావు?' అన్నాడు, ఒకప్రక్కనరోతపడుతూ.

'ఏం, రాగూడదా ?' ధైర్యంగా అన్నది, రాధ.

'రావొచ్చు. కాని ఎందుకా చెదలుతిన్నముఖాన్ని చూపించడమా అని.' రాధకి తలమీాద పిడుగు పడిన

ట్టయింది. ఎలా సంబాళించుకోవాలో తెలీలేదు. యేడ్చింది. అయినా రాధభర్తకి కరుణ కలగలేదు.

'ఇదుగో చెబుతున్నాను విను. ఈ ముఖంతో నా దగ్గరకు రావాకు. నిన్ను నేను ప్రేమించలేను. నీకు దూరంగా వుండటం మంచిది. నా ఆనందానికి అడ్డురాకుండావుండటం నీకూ మంచిదే —'

'అంటే? అన్నది రాధ, రోషంగా. ఎక్కడలేని తెంపు ఆమెలో బయలుదేరింది.

'అబ్బో! రోషం వొచ్చింది, కోతిముఖానికి! ఇంత రోషంగలవాళ్లు మా యింట్లో పడిగాపులు పడి, వెట్టిచాకిరీ చేసి మాకు అసహ్యాన్ని తెప్పించడం దేనికి ?'

ఇక వినలేకపోయింది, రాధ. అటువంటి కర్ణకఠోరమైన మాటలు విని సహించాలంటే గౌరవం, మర్యాద తెలీని వాళ్ళన్నా కావాలి, ఇక అక్కడ వుంటేనేతప్ప జరుగుబాటు కానట్టుగానన్నావుండాలి, — ఈ రెంటికి రాధ, తాతయ్యా చాలాదూరం. ఈ రెంటితోనే వాళ్ళపోరాటం. ఇకఆయింట్లో ఎందుకువుండాలో అర్థంకావడంలేదురాధకి. ఏడుస్తూ తాతయ్య దగ్గరకొచ్చింది. 'ఏన్నాళ్ళీ నరకంలో కొట్టుకులాడాలి ? యిక్కడ ఎందుకు మనం ? మనవూరుపోదాంపద, తాతయ్యా; మనమిద్దరం జీవించడానికి కోకొల్లగా సరిపడ్డ ఆస్తివుంది మనకు' అని బావురుమన్నది రాధ.

తాతయ్య ఇక్కడ జరుగుతున్న అవమానకరమైన, నీచాతినీచమైన పనుల్ని స్ఫురణకు తెచ్చుకున్నాడు.

మనమరాలి మాటను కాదనలేకపోయాడు. కాదనటం ఆమెను నిలువునా హింసించటంగా తోచింది.

మరునాడు తమవూరు వొచ్చారు తాతయ్యా, రాధా. రాధ అత్తమామలు 'పోవొద్దు' అనికూడా అనలేదు.

# 5

నెల గడిచింది. మొదట్లో రాధ, తాతయ్యా స్వగ్రామానికి రావటం వూళ్ళోవాళ్ళకి ఏమంత ఆశ్చర్యాన్ని కలిగించలేదు కాని రానురాను వాళ్ళనుగురించి వున్న రహస్యం కాస్తా బయటపడజొచ్చింది.

మొదట్లో — 'ఎన్నిరోజులకు వొచ్చారు, స్వగ్రామానికి' అని వొకరంటే, మరొకరు – చూడు! పిల్లా, తాతా ఎలా అయిపొయ్యారో! ఎలాగైనా యితర్ల యింటిదగ్గర వుండడం అనేది—' అనేవారు. ఇంకొంతమంది – 'నువ్వు దగ్గరవుండే పిల్లని అలా ఎందుకు చెడగొట్టావు తాతయ్యా!' అని తాతయ్యను అడిగారు.

'మనం చేసేదేముంది? అంతా ఈశ్వరేచ్ఛ. ఆ మాయదారి జబ్బురావటంవల్లనే పిల్ల యిలా తయారయింది' అని చప్పగా జవాబు చెప్పాడు తాతయ్య.

కాని వాళ్ళెవరకీ మొదట్లో తాతయ్య రాధఅత్తగారి యింట్లో పడినఅగచాట్లు అంతగా తెలీవు – ముఖ్యంగా రాధ మళ్ళీ అత్తవారింటికి పోనవసరంలేదని. నిజందాగదు. తరువాత తరువాత అసలు విషయాలు బయటపడ్డాయి.

తాతయ్య యశస్సుకు అవాంతరం వాటిల్లింది. ఇదివ రకు తాతయ్యనీ, రాధనీ పరామర్శించ వొచ్చినవాళ్ళే ద్వేషించటం ఆరంభించారు.

'ఎంత ఆస్తి వుంటే మటుకు యేంలాభం. నీతిలేని తరు వాత ?' అని ఎవరో తాతయ్య బజార్నుంచివొస్తూంటే వెనకాల అన్నారు. తాతయ్య భుజాలు తడివిచూసుకొని బాధ పడ్డాడు.

ఇంకోసారి రాధ పూలుపెట్టుకొని క్రొత్త చీర కట్టు కొని వాకిట్లో నుంచుంటే పక్కిళ్ళ ముత్తయిదువలు 'మొగుణ్ణి వొదిలిపెట్టిన ముండకు ఎన్ని అలంకారాలు' అనటం రాధ విన్నది. కళ్ళవెంబడి నీళ్ళు గిర్రునతిరగ్గా యింట్లో కెళ్ళి దిండును కావిలించుకొని యేడ్చింది.

మరోసారి రాధ వూళ్ళోసినిమాకు వెళితే, ప్రక్కన కూచున్న ఆడవాళ్ళు తనని యెరిగిన ఆడవాళ్ళు 'ఆక్కడ మొగుణ్ణి విడిచిపెట్టి యిక్కడ సినిమాలు చూస్తున్నది. మంచిదే' అని అన్నారు.

వీటిని సహించే తాలిమి రాధలోలేదు. అసలు ఆమెలో తాల్మిలేదు. యేమన్నావుంటే అది అత్తగారింటి దగ్గర మాటల్ని సహించటంతోటే సమసిపోయింది. ఆరాత్రియెంత యేడ్చినా రాధహృదయంలోని దుఃఖం చల్లారలేదు.

తనుచేసిన తప్పేమిటి ? తనని యెందు కందరు అలా అంటారు ? తనేం నీచత్వానికి పాల్పడింది ? అత్తగా రింటిదగ్గర కుళ్ళును ఆరాధించలేక, భర్త దగ్గర కృత్రిమ ప్రేమను పొందలేక, తాతయ్యనూ తననూ చూసే నికృష్టపు

చూపులు భరించలేక స్వగ్రామానికీ, హాయిగా బ్రతికేందుకు వస్తే — తననిట్లా అపార్థంచేసుకున్నారేమిటి ? — ఈవిధంగా ఆరాత్రి ఆమె కుమిలికుమిలి యేడ్చింది.

తాతయ్య మానసికంగా గొప్ప బాధపడుతున్నాడు — మనమరాలికోసమని యేదారి తొక్కినా — ఆ దారంతా ముళ్ళకంచెలదారిగా కనబడుతున్నది. ఈ బాధతో తాతయ్యకి సరిగ్గా లోపలకు తిండిపోవటంలేదు. ఒకటికెండుసార్లు తను బజారున వొస్తున్నప్పుడు వెనగ్గా, తననుగురించీ రాధను గురించీ గుసగుసలు చెప్పుకోవటం వినిపించినవి. తమచరిత్ర ఈ ప్రజలనోళ్ళల్లో పడుతుందని ఎన్నడూ వూహించలేదు తాతయ్య.

ఒకరోజు మనమరాలిదగ్గర అనేశాడు. 'ఈ అప్రదిష్ట కంతటికి నేనే కారణమమ్మా ! నీకటువంటి సంబంధం కుదర్చకపోయునట్లయితే నీజీవితం సుఖంగా గడిచిపోయేది. '

'అలా అధైర్యపడవాకు తాతయ్యా; ' అని లేనిధైర్యం కొనితెచ్చుకుంది, రాధ.

తాతయ్య మంచంపట్టాడు. అతను మంచంపట్టటానికి కారణం మనమరాలిజీవితం చివరకు యిలా అయిందేమా ! అని. సగం ఈదిగులుతోనే అతనిమతి దెబ్బతిన్నది. ఒక్కొకప్పుడు రాధఅత్తమామల్ని, భర్తనీ తిట్టిపోసేవాడు. అంతకీ కసితీరకపోతే అరిచేవాడు. రాధకి ఆసమయాల్లో భయమేసేది.

డాక్టర్ను పిలిపించింది రాధ. మందిస్తున్నాడు డాక్టరు. ఆముసలితనంలో మందు వంటపట్టటంలేదు. తాతయ్య ఎక్కు-

వగా దిగులుపడుతున్నాడు. రాధను పిలిచి పిచ్చిపిచ్చిగా ఏమేమో అంటూండేవాడు.

'రాధ! నిన్ను నేను — చంపేశాను. నీఆనందాన్ని ధ్వంసంచేశాను.' రాధ వారించేది. కాని వినేవాడు కాదు.

'ఈజీవితంలో నువ్వుసుఖించటాన్ని చూడలేక పోయాను. అది చూడటానికే యిన్నిరోజులూ బ్రతికింది. అని కంట తడిపెట్టుకొనేవాడు, తాతయ్య. ఈమాటలతో గతచరిత్రంతా నెమరుకువచ్చి బాధపడేది రాధ.

రోజులు గడుస్తూన్నకొద్దీ తాతయ్య పరిస్థితి మరీ విపరీతంగా వున్నది. పిచ్చిపిచ్చిగా మాట్లాడటం అధికమైంది. రాత్రి పూట తను పండుకొనేగదిలో దీపం వెలిగించనీయడు. ఆ చీకట్లోనే అటూఇటూ గోడను తవ్వుళ్లాడుతాడు. యేమివిపత్తు సంభవిస్తుందోనని ఆ గదిలో తనుకూడా పండుకొనేది రాధ.

# 6

రెండు రోజుల్నుంచి తాతయ్యకు ధారకంలేదు. బంధువులకు కబురుచేసింది రాధ. ఒకప్రక్కన కుమిలికుమిలి యేడుస్తూ, ఒకప్రక్కన తాతయ్యకు ఉపచారం చేస్తూనేవుంది. తాతయ్య రాధనుగురించి దిగులుపడుతూనే వున్నాడు. మధ్య మధ్య పిచ్చిపిచ్చి మాటలంటున్నాడు. రాధా, 'యేడవొద్దు' నేను బ్రతుకుతాను — నీ జీవితం సుఖవంతమయ్యేవరకూ నేను బ్రతుకుతాను, అని చెబుతున్నాడు, తాతయ్య.

బయటవాకిట్లో జట్కాబండి ఆగింది. ఏచుట్టం వొచ్చాడోఅని రాధ విసనకర్ర క్రిందపెట్టి వాకిట్లోకొచ్చి చూసింది.

సంచి చేత్తోపట్టుకొని తనభర్త దిగాడు, బండిలోంచి. నమ్మలేక పోయింది, రాధ. కళ్ళు తుడుచుకు చూసింది. తనభర్తే!

లోపలకు వొచ్చాడు ఆయన. రాధ బిగ్గరగా ఏడ్చింది. అర్థంకాలేదు ఆయనకు—తరువాత తాతయ్య స్థితిచూసి అర్థం చేసుకున్నాడు. తాతయ్య రాధభర్తను చూసి మూసుకు పోయే గ్రుడ్లని పెద్దవిచేశాడు.

ఎందుకొచ్చావన్నట్టు చూశాడు, తాతయ్య.

రాధభర్త తాతయ్య మంచందగ్గర కూచుని అన్నాడు—'తాతయ్యా! నన్ను క్షమించు. మాకుటుంబాన్ని క్షమించు—నీకూ రాధకూ ఎన్నో కష్టాల్ని కల్పించి బాధపెట్టి యింట్లో నుండి సాగనంపాము. అదంతా మా అవివేకమని తెలుసుకున్నాము. మా నాన్నా అమ్మా నిన్నూ, రాధనీ తీసుకు రమ్మని నన్ను పంపారు. బుద్ధి వొచ్చింది. తీసుకెళ్ళటానికి వొచ్చాను. వూళ్ళో అనేకం అంటున్నారు, మమ్మల్ని'

తాతయ్యకి అర్థంకాలేదు. రాధ తలుపుచాటునవుండి వింటున్నది. పీటమీదవున్న మందుసీసానీళ్ళలో బుడగయేర్పడింది.

తాతయ్య, రాధ భర్త చేతిని దగ్గరకు తీసుకొని —'నిజమేనా?' అన్నాడు.

'నిజంగా తాతయ్యా!' అని కంటతడిపెట్టుకొన్నాడు.

'తీసుకెళ్ళు. అబ్బాయి, నేనిక వొచ్చేదిలేదు. యీ లోకాన్నే విడిచిపెట్టి వెళుతున్నాను' అని అన్న అరగంటకు తాతయ్య చనిపోయాడు. అయితేయేం? చనిపోయేప్పుడు తాతయ్యలో ఉత్సాహంవొచ్చింది. చల్లనికబురు విన్నాడు. అటువంటి వార్తకోసమే, రాధ జీవితంలో అటువంటి స్థిరత్వం

ఏర్పడేందుకే తాతయ్య ఇన్ని సంవత్సరాలనించీ కృషి చేసింది. చివరకు అది అవసానదశలో ఫలించింది. అందుచేతే తాతయ్య నిశ్చింతగా వాయువులో లీనమయ్యాడు.

రాధ పెద్దపెట్టున యేడ్చింది. రాధభర్తకూడా కంట తడి పెట్టుకున్నాడు. ఇంకోగంటకు బంధువులు వొచ్చారు. అందరూ యేడ్చారు. తాతయ్యకు అంత్యక్రియలు జరిపారు.

చిన్నదినం బాగానేజరిగింది. ఆ పదిహేనురోజులూ అక్కడేవున్నాడు రాధభర్త. ఈ లోపల అత్తమామలు రెండుసార్లువొచ్చి, కొంచెంసేపు కంటతడిపెట్టుకొని వెళ్ళారు. రాధకు తాతయ్య అవసానదశలో భర్తప్రాపు ప్రాప్తించడం గొప్ప అదృష్టంగానే కనపడ్డది. మనసులో భగవంతుడికి వెయ్యి కొబ్బరికాయలు కొట్టుకుంది. ఈ అత్తమామలు, రాధభర్త రావటంతో ఊ పూళ్ళోవాళ్ళు అనుకున్నమాటలు కేవలం అప వాదులుగా తయారయినై. అలా అనుకున్నందుకు తమకు తామే చిన్నపోయారు.

పెద్దదినం జోరుగా జరిపారు. పూరబంతిపెట్టారు. పెట్టె తాళంచెవులు భర్తకు యిచ్చింది రాధ. ఊళ్ళోవాళ్లు చాలా సహాయపడ్డారు. అలగాజనానికి రెండురోజులు అన్నదానం చేశారు. రాధఅత్త ఆడవాళ్ళబంతుల్లో వడ్డన చాలా ఆప్యా యంగాచేసి, తనకు తాతయ్యమీదా, కోడలుమీదాగల అపారభక్తిప్రేమల్ని వివరించింది. ఎందుకనో రాధకి చాలా ఆనందంచేసింది. అత్తమామల్లో, తనభర్తలో యింతమంచి ఎక్కడిదా అని ఆలోచించింది. ఈ మంచి వాళ్ళలో ఎప్పుడూ వున్నట్టు, తనూ తాతయ్యా ఒకవేళ ఆ మంచిని అపార్థంచేసు

కోవటంవల్ల ప్రవర్తన యిలా పరిణమించిందేమో! అని వాపోయింది.

పెద్దదినమయిన మరునాటినించీ బంధువులందరూ తమయిళ్లకు వెళ్లారు. రాధ అత్తమామలు మరిరెండురోజు లుండి, కోడలికి ధైర్యంగొలిపి వెళ్లారు. రాధభర్త పదిరోజు లుండి కవులువాళ్ల వద్ద, ఆ సంవత్సరం బకాయివున్నవాళ్ల వద్దా క్రమంగా వసూలుచేసి, ఆ యిల్లును పూర్వపు బాహ్మలకి నెలకి పదిహేనురూపాయల అద్దెకాడికి యిచ్చి, రాధని తీసు కొని తనవూరు వచ్చాడు. రాధకి తనయింటిదగ్గరే భర్తని అట్టిపెట్టుకోవాలని వున్నది. దినమైన నాలుగోనాడు అన్నది.

'మీారుకూడా యిక్కడే వొచ్చివుండండి' అని.

రాధభర్త త్రుళ్ళిపడి 'అహాఁ! అలాకాదు. మునుపటికి మల్లేనే ఈ యిల్లు అద్దెకు యిచ్చేయొచ్చు. మనం మా యింటి దగ్గరే వుందాం. పూర్వపుటిదంతా మరచిపో'

'ఇక్కడుంటే ఏమేం?' అన్నది రాధ.

'అదికాదు. నన్ను చూడకండా మాఅమ్మా నాన్నా ఒక్క క్షణంకూడా వుండలేరు. అంతగా వుందామంటే ఒక సంవత్సరం గడిచింతరువాత చూసుకోవొచ్చు. మనిషి చచ్చిన యింట్లో కాపురం వుండటం ఏమంత బాగుండదు' రాధ సరేనన్నది.

## 7

రాధని అత్తవారింటిదగ్గర ఆప్యాయంగా చూడటం మొదలెట్టారు. వాకిట్లోకి అడుగుపెట్టగానే అత్తగారువాకిట్లో నిలబెట్టి దిష్టి తీసివేసింది.

'ప్రయాణబడలిక' అని కాఫీ కాసియిచ్చింది. ఈ గౌరవం అత్తగారిలో నేడే చూడగలిగింది రాధ.

మునుపటికిమల్లే పనులూ చేయించడంలేదు రాధచే, రాధఅత్తగారు. ఒక పనిమినిషిని నెలజీతంమీద కుదిర్చి పెట్టింది. అన్నం, కూరలు వగైరాలు తానేచూస్తున్నది. రాధని యేమన్నా పుస్తకాలు చదుకోమంటూంటారు.

రాధభర్త రాధని చాలా ప్రేమగా చూస్తున్నాడు. ఎప్పుడూ తనదగ్గరే అట్టేపెట్టుకుంటాడు. అప్పటి చెదలు ముఖాన్ని యిప్పుడు ముద్దుపెట్టుకొని లాలిస్తున్నాడు.

'నిన్ను యిదివరకు అంత అనాదరణగా ఎందుకని చూశానో నా కర్థంకావటంలేదు.' అన్నాడు ఒకరోజు సాయంత్రం. గత జీవితాన్ని మర్చిపోవటానికి రాధ చాలా ప్రయత్నిస్తున్నది. ఒక్క తాతయ్యనుతప్ప మిగిలిన కష్టాలన్నిటిని మరిచిపోగలుగుతున్నది. తాతయ్యే ఆమెహృదయం లోంచి తొలగిపోలేకపోతున్నాడు. తాతయ్య జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా అప్రయత్నంగా ఆమె నేత్రాలనుండి అశ్రు బిందువులు జలజల రాలుతయ్.

'అదంతా మరిచిపోండి. ఇక పొందబోయే సౌఖ్యాన్ని గూర్చి కలలుకందాం.' అని కావిలించుకొంది.

రాధభర్త అప్పుడప్పుడూ తాతయ్య పొలాన్నిగురించి మాట్లాడేవాడు. రాధ సరైన సమాధానాలే చెప్పేది. కాని భర్త అలా ఎందుకని అడుగుతున్నాడో — అది అర్థంకాక పోయినా కనీసం అర్థంచేసుకోడానికైనా ప్రయత్నించటానికి కాలాన్ని వెళ్ళబుచ్చేదికాదు. తన జీవితం అనుభూతుల్లేని మోడై పోయిందని నిరాశపడి వూరుకొన్న సమయంలో భగవదనుగ్రహంవల్లనో, మరి ఏ అంతరకారణాల బలీయంవల్లనో భర్త కరుణచూపాడు. ఆశలు చిగిర్చినవి, ఆమె జీవితంలో — వాటిని సాకల్యంగా సార్థకపరుచుకొనేందుకు సర్వాన్ని మరవటానికి ప్రయత్నాలు సలుపుతోంది.

రాధ మామ ఒకరోజున — 'తాతయ్యవుంటే ఎంత బాగుండేది? మనుమరాలి జీవితాన్ని చూసి ఆనందపడే వాడు' అని అన్నాడు. ప్రక్కన కూచుని విన్నది రాధ. తాతయ్య తలపుకు రాగానే యేడ్చింది.

'యేడవకమ్మా! చచ్చినవాళ్లు బ్రతికి వొస్తారా? ఇక యెప్పుడూ తాతయ్యవూసు ఎత్తనులే' ఆనాటినుంచీ తాతయ్య ప్రసక్తి ఎవరూ ఎత్తలేదు — రాధహృదయంలోని పుండును కెలికినట్లవుతుందని.

రాధ యిప్పుడు సుఖమంటే యేమిటో రుచిచూడ గలుగుతున్నది. ఆమెకు సంతోషాన్ని చేకూర్చటానికే ఆ కుటుంబములో ప్రతివ్యక్తీ పాటుపడుతూన్నట్టు కనబడుతున్నది. ఒకరోజు రాధమామ ఏవేవో కాయితాలుతీసుకొచ్చి తన కొడుకుని చాటుగా గదిలోకి పిలిచి యేమేమో గుసగుసలు చేసినట్టు గమనించింది, రాధ. అయితే వాళ్ళేమని అను

కొన్నారో ఆ కాగితాలు వేటికి సంబంధించినవో, ఆ కాగితాల్లో యేమిరాసివుందో రాధకి తెలీదు.

ఆ రాత్రి పడకగదిలో ఆకబురూ ఈకబురూ అయిం తరువాత రాధభర్త ఏవో కాగితాలమీద సంతకాలు పెట్టమని రాధని అడిగాడు.

'ఏమి టా కాగితాలు ?' అన్నది రాధ భయపడుతో.

'ఆఁ ! యేమీలేదు — సంతకాలు పెట్టు, చెబుతాను'

ముందూ వెనుకా యేమీ ఆలోచించకండా ఆ కాగితాలమీద సంతకాలుచేసింది రాధ. ఆమధ్యన ఆమె భర్తలో గాఢంగా లీనమైంది. రెండుహృదయాలూ ఒకటేనని నమ్మింది. అంచేత భర్త తనకు ఏవిధమైన అపచారమూ చేయడని సంతకాలు పెట్టింది.

అమాంతంగా రాధని కావిలించుకొని ముద్దులతో నింపాడు. మర్మమేమిటో, నర్మమేమిటో — భ్రమయేమిటో, ప్రమయేమిటో అర్థంచేసుకోగల పరిపక్వత ఆ సుఖసమయంలో రాధలో మృగ్యంకావడం ఆశ్చర్యకరమైన విషయంకాదు.

నెలరోజులు గడిచినవి. రాధఅత్తగారికి ప్రతి సాయంత్రమూ, ప్రొద్దునపూటా తలనొప్పిరావడం మొదలెట్టింది. అందుచేత ఆమెచేసేపనులు — అన్నం వండటమూ, కూరలు తయారుచేయటమూ రాధమీద పడింది. అయినా యేమనుకోకండా రాధ చేస్తున్నది. ఆ కాయితాల్లోని విషయం యేమిటో రాధ కింకా తెలియనేలేదు. ఒకరోజు భర్తని నిర్బంధించి అడిగింది.

'ఆఁ! ఏమీలేదు. మనమిద్దరం ఒకటేగా! యేముంటుంది. ఆవూళ్ళోపొలం నాపేర పెట్టించాను' అన్నాడు నవ్వుతూ.

రాధగుండెలో రాయిపడింది. తనపేరనవుంటేయేం? తనఆస్తి — తాతయ్యఇచ్చింది. దాంట్లోఆదాయం భర్తే తీసుకుంటున్నాడుగా!

'ఏం! నాపేరనవుంటే?' అన్నది సహం అనుమానం, సహం ఆదుర్దాగా.

'ఏంలేదు. ఆడవాళ్ళపేరన ఎందుకాలని. మానాన్న మాఅమ్మవేపువాళ్ళు చస్తే వొచ్చిన అయిదెకరాలనీ తనపేరే పెట్టించుకున్నాడు' అన్నాడు రాధభర్త.

ఆ సమాధానం రాధని తృప్తిపరచలేకపోయింది. కాని దాన్నిగురించి ఆలోచించి బుర్రను చెడగొట్టుకోలేదు.

రాధఅత్త పనిమనిషిని వెళ్ళగొట్టింది. అనవసరంగా వెళ్లిందని సాకుచెప్పింది రాధఅత్త. ఏమైతేనేం మొత్తానికి అన్నిపనులూ రాధనెత్తిమీద పడ్డవి పూర్వంలాగా.

రాధభర్త ఇప్పుడు రాత్రులు సరిగ్గాయింటికి రావడం లేదు. ఒకనాడు అడిగింది, రాధ — 'ఎక్కడికెడుతున్నారు రాత్రులు?' అని.

'యెక్కడికీలేదు — పనుండి తిరుగుతున్నాను'

రాధ అత్తలో పూర్వపు కర్కశత్వం బయలుదేరింది. ఆపని చేయలేదని ఈ పని చేయలేదనీ కఠినంగా శాసించడం, అధికారాన్ని చెలాయించడం ఆరంభించింది. రాధ సహించ

లేకపోతున్నది. 'పనిమనిషిని పెట్టుకోండి. ఈపని నేను చేయ లేను' అని ఒకరోజున ఖచ్చితంగా చెప్పింది రాధ.

'చెయ్యవూ — చెయ్యకపో, తిండి ఎలా తిందువు గానో చూస్తాను' అని గర్జించింది. ఆకారణాన రెండు రోజులు పస్తు రాధ.

మనుష్యుల్లో యింతమోసం, ఆస్తికోసం కృత్రిమప్రేమ, నానా బదవలూ పడటం — ఎలావుందో అర్థంకాలేదు, రాధకి. తన ఆస్తికోసం తనయందు ఆప్యాయత చూపించి, ఆపని కాస్తా తీరిపోయిన' తరువాత కర్కశత్వం ఆరంభించారని గ్రహించింది, రాధ. అసహ్యమేసింది. భర్తతో చెప్పింది, జరుగుతోన్న తతంగమంతా.

'ఏం, పనిచేయలేకపోయావా ?' అని పేలవంగా అన్నాడు. 'మీరంతా మోసగాళ్ళు. ఈ పన్నాగాలన్నీ నాఆస్తికోం పన్నారు. మీరు కపట ప్రేమని నటించి, లాలించి ఆ పొలాన్ని కాస్తా తమ పేరున పెట్టించుకున్నారు. తరువాత ఆ ప్రేమమాటలులేవు, లాలింపులు లేవు; కర్కశత్వాన్ని ఆరంభించారు. మీ అమ్మగారు పనిమనిషిని వెళ్ళకొట్టారు. అస్తమానమూ పనిచేయమంటున్నారు. లేకపోతే భోజనం పెట్టమంటున్నారు. మీరు మళ్ళా మీముండలతో వూరేగుతున్నారు' రోషంగా పలికింది, ఈ మాటల్ని రాధ.

రాధభర్త యేమనలేదు. అక్కడనించిలేచి మరోగది లోకి వెళ్ళాడు.

మరునాడు తెల్లవారిసూర్యునికిరణాలు కిటికీలోగుండా రాధ నిర్జీవమైన చాపలమీద కాంతిహీనంగా పడ్డవి. ఎనిమిది

గంటలకు రాధఅత్త రాధకోసం గబగబా అమితమైన కోపంతో, చేతులో చీపురుతో వొచ్చింది గదిలోకి. దూలానికి కట్టివున్న తాడు తెగి గాలికి అటూఇటూ వూగుతున్నది. రాధ క్రిందపడివుంది. రాధఅత్త నిలువునా కొయ్యబారిపోయింది.

రాధ చనిపోయేముందు తాతయ్యని తలుచుకొంది. తను చనిపోయింతరువాత తాతయ్య దగ్గరకు చేరగలుగుతుందని ఆమె విశ్వాసం!



# ప్రస్థానం

రంగాయి వడివడిగా నడుస్తున్నాడు. వాడి హృదయం లోని చీకాకు, ఆత్రుత, బాధ వాడ్ని అల్లా వేగంగానడిపిస్తు న్నాయి. వేసవికాలపు మిట్టమధ్యాహ్నపు ఎండ వాడితలనీ, వడగాలి వాడి చెంపలనీ, బజారు దుమ్ము వాడి చెప్పుల్లేని పాదాలనీ కాల్చివేస్తున్నప్పటికీ లక్ష్యపెట్టక — రంగాయి నడకను సత్తువకొద్దీ హెచ్చిస్తున్నాడు. పరుగెత్తాలని వాడు చేసే ప్రయత్నమంతా వృథా అవుతున్నది. మనసులోని ఆత్రుత అధికంవల్ల ఆ కాళ్ళు తేలిపోవటంచేత, చిరిగిపోయిన చొక్కా, మోకాళ్ళపైవరకు లాగు, నూనెలేని తల, దుమ్ము కొట్టుకొన్న పాళ్ళు, లోతుకు పీక్కుపోయిన ఎరుపు జీరలువారి బీదతనాన్ని వ్యక్తీకరిస్తున్న కళ్లు, ముందుకు పడబోతూన్న నడక — రంగాయి బావివద్ద రావిచెట్టుక్రింద కూర్చున్న పెద్దమనుష్యులకు కొంత ఆశ్చర్యాన్ని కలిగించాడు. వీధి చివర కరణం కోదండరామయ్యగారి యింటిముందు హఠాత్తుగా ఆగాడు రంగాయి. గడపదగ్గర నాపరాళ్లు చుర్రున అంటూకు న్నాయి రంగాయి పాదాలను. 'అబ్బా,' 'ఉస్' అనుకుంటూ కాళ్ళ మునివేళ్ళమీద నిలబడేందుకు ప్రయత్నిస్తూ—

"కరణంగారూ!" బిగ్గరగా కేకవేశాడు—

జవాబులేదు. రెండుసార్లు నోరు చించుకొని తలుపు కొడుతూ పిలిచిం తరువాత కరణంగారి చిన్నకూతురు తలుపు

తీసి "గొడ్డులా అట్లా అరుస్తావెందుకు ?" అన్నది. రంగాయి సిగ్గుపడ్డాడు.

కరణంగారు పందిరిక్రింద పడకకుర్చీలో కూర్చొని లెక్కలు చూసుకుంటున్నారు. రంగాయి ఎదురుగా చేతులు కట్టుకొని నిలబడి పెదాలు విప్పబోతూన్నాడు. కళ్ళజోడు తీసి గుడ్డతో తుడుస్తూ "ఏంరా !" అన్నారు కరణం కోదండ రామయ్యగారు.

"మా అయ్యకు ఇవాళ దగ్గు ఊపిరాడటంలేదు. ప్రొద్దున నెత్తురుకక్కాడు. మిమ్మల్ని ఉన్నపళంగా తీసుకురమ్మన్నాడు" తరువాత మాట చెప్పటానికి రంగాయి బిగ్గరగా యేడ్చాడు. "ఇంకా బ్రతికే ఆశ లేదన్నాడు. భూమిమీద గింజలు నేటితో సరట."

చిన్న కూతుర్ని పుస్తకాల దస్త్రాన్ని లోపల పెట్టమని చెప్పి గొడుగు అందుకొని రంగాయివెంట బయలుదేరారు కరణంగారు.

భూషయ్య— అంటే రంగాయి తండ్రి తాపీ పనివాడు. అనాదినుంచీ వాళ్ళ వంశీకులు తాపీ పనిచేసే పొట్ట పోషించుకొంటూ వచ్చారు. తండ్రికిమల్లేనే భూషయ్య గోడలు కట్టడంలోనూ, పెంకుటిళ్లు కప్పడంలోనూ గ్రామంలో మంచి పేరు సంపాదించాడు. వాళ్ళ కుటుంబం ఎప్పుడూ మంచికి చెడకూ కరణంగారిని ఆశ్రయించుకొని ఉంటూ ఉండేది. కోదండరామయ్యగారి హయాములో భూషయ్యకూడా అంతే. కరణంగారి డాబా కట్టింది భూషయ్య ఆధ్వర్యానే. వానా కాలంలో పనులు సరిగా దొరకనప్పుడు, తిండికి చాలా కటు

వుగా ఉంటే ధాన్యాదికాలు కరణంగారే సహాయంచేస్తుంటారు. అందువల్ల భూషయ్య అయినా చిన్నచిన్న పనులకు కరణంగారినుంచి డబ్బుతీసుకోనేవాడుకాదు. కరణంగారి గడ్డి వామిలోనే తన ఒక్కగాను ఒక్క పాడిగేదెకు భూషయ్య మేత దూసుకోనేవాడు. కరణంగారి కుటుంబానికీ, భూషయ్య కుటుంబానికీ అటువంటి సంబంధంఉంది. కాని యింత అండ ఉన్నా భూషయ్య అదృష్టవంతుడుకాదు. వ్యాధిదేవత వాళ్ళను ఎప్పుడూ విడిచిపెట్టలేదు.

రంగాయిని కన్న మూడు సంవత్సరాలకు భూషయ్య భార్య క్షయవ్యాధితో చనిపోయింది. భూషయ్య, కొద్ది సంపాదన ఆవిడ జబ్బుకే హరించిపోయింది. మళ్ళా భూషయ్య అయిదేళ్ళవరకూ పెళ్ళిచేసుకోలేదు. ఆ పైన ఏం బుద్ధి పుట్టిందో బంధువులలో ఒక పిల్లను వివాహం చేసుకున్నాడు. ఆమె యేడాదిన్నర కాపరంచేసి భూషయ్యకు క్షయరోగం ఆరంభమైందని తెలుసుకొని భీతిచెంది భూషయ్యను విడిచిపెట్టింది. భూషయ్యకు కష్టాలు ఆరంభమైనవి. వండిపెట్టే దిక్కు ఉన్నప్పటికీ భూషయ్యలో దిగులు జాస్తి కాసాగింది. తల్లి రెండు సంవత్సరాలవరకు వండిపెట్టి వృద్ధత్వంచేత కాలధర్మం పొందింది. కరణంగారు మందుతినమనియిచ్చిన కొంత డబ్బూ, తను సంపాదించినడబ్బూ కలిపి దాదాపు సంవత్సరం పాటు మందు పుచ్చుకున్నప్పటికీ ఫలితం శూన్యమైంది. రంగాయి గతి యేంకాను? ఇంకా వాడికి నిండా పన్నెండేళ్ళు వెళ్ళలేదు. తన ఆస్తిమీంద జీవించటానికి తను సంపాదించిందిలేదు. రంగాయిని ఆదరించే బంధువులెవ్వరూ లేరు.

తను చావడం ఖాయం అని తెలుసుకున్న దగ్గర్నుంచీ రంగాయి జీవితాన్ని గురించి ఉన్న సమస్య భూషయ్యకు ఏవిధంగాను తేలక కరణంగార్ని పిలుచుకు రమ్మనమని చెప్పాడు. కరణం గారు సమస్యాపరిష్కారం చేస్తారని భూషయ్యకు గట్టి నమ్మకం.

రంగాయి కరణంగారిని వెంటబెట్టుకొని పూరింట్లోకి తీసుకొచ్చాడు. భూషయ్య గౌరవపురస్సరంగా లేవాలని ప్రయత్నం చేశాడు కాని, లేవలేకపోయినాడు.

"పర్వాలేదు" అంటూ రంగాయి తెచ్చివేసిన చాప మీద కూర్చున్నారు కరణం కోదండరామయ్యగారు. రంగాయి బిక్కముఖంతో నిలబడ్డాడు.

"ఎట్లాఉంది భూషయ్యా!" అన్నారు కరణంగారు.

భూషయ్య సమాధానానికి బదులు కన్నీటిని కార్చాడు. అవసానదశలో భూషయ్య శారీరకంగానే కాకుండా మానసికంగా పొందుతూన్న వ్యథను కరణంగారు యిట్టే అర్థంచేసుకోకలిగినారు.

"అయినదానికి విచారం దేనికి భూషయ్యా! నీకు దైవగీత అలావుంది. తొలగించటానికి కర్తలెవరు?" అన్నారు కరణంగారు సహజధోరణిలో.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి. తన మనసు లోని మాటను ఎట్లా బయటపెట్టాలో ఆలోచిస్తున్నాడు భూషయ్య. కోదండరామయ్యగారికి తనని భూషయ్య పిలిపించిన హేతువు తెలియకపోలేదు. కాని, తను బయటపడ దలుచుకోలేదు.

"కరణంగారూ!" అన్నాడు భూషయ్య. ఆ పలుకులో ఎంతో విచారం వ్యక్తమైంది.

కరణంగారు సమాధానంగా "ఊఁ!" అని తల ఆడించారు.

"ఇంకా నేను బ్రతికేది లేదని రూఢి అయిపోయింది. వ్యాధితో ఎక్కువకాలం బాధపడేకన్నా త్వరగా చావటం సంతోషమే అయినా రంగాయినిగురించిన విచారం ఒక్కటే నన్ను బాధిస్తోంది. వాడింకా పసివాడు. ఈ చిన్నతనంలో అదుపుఆజ్ఞల్లో పెరగని పిల్లలు ఆకతాయిగా తిరిగి పెద్దవాళ్ళయింతరువాత తమ బాధ్యతని గుర్తించుకోలేనంత విజ్ఞానవిహీనులౌతారు. కాని...రంగాయిని బాగుచేసే యోగ్యత నాకు లేదు..." కళ్లు తుడుచుకున్నాడు భూషయ్య.

తనని గురించి తండ్రికి యింత బాధా, ఆలోచనా ఉందని రంగాయికి తెలియదు. తండ్రితోపాటే వాడూ కళ్ళను నీళ్ళతో తడుపుకున్నాడు. కరణం కోదండరామయ్యగారికి భూషయ్య అసలు విషయాన్ని తనవద్ద బయటపెట్టలేక పోతున్నాడనేది సులభంగా బోధపడింది.

"ఆ దిగులు దేనికిలే భూషయ్యా! అన్నిటికీ పైన ఆ పరమేశ్వరుడే ఉన్నాడు. నాదగ్గర ఉంచు. ఇంట్లో పని చేస్తూ ఉంటాడు. కూటికి గుడ్డకు లోపం లేకుండా చూస్తాము." అన్నారు కరణంగారు. భూషయ్యకు తన ఉపకారం అర్థమయ్యేట్టు.

కాని, భూషయ్య ఈ ఉద్దేశాన్ని లోపల పెట్టుకొని కరణంగార్ని పిలిపించలేదు. ఈ విధంగా రంగాయి జీవితం

సాగటం యిష్టంలేదు. వాడు ముందుముందు బాగుపడాల్సిన పద్ధతి యిదికాదు. అనాదినుంచీ తన వంశపారంపర్యంగా వస్తూన్న విద్యనే నేర్చుకొని, ఊళ్ళో పదిమందిచేతా పనివాడనిపించుకొనే అదృష్టాన్ని అందుకొని — కుటుంబపోషణ గుట్టుగా చేసుకొనే సమర్థుడు కావాలి. భూషయ్య హృదిలో పాతుకున్న ఈఅభిప్రాయం ప్రకారం రంగాయి కరణంగారింట్లో ఉంటే జరిగే అవకాశంలేదు. కేవలం అంతే కాకుండా రేపు రంగాయి స్వతంత్రంగా బ్రతకలేనంతగా పరిస్థితుల వారసుడు కావొచ్చు, చెప్పినంతపని చేసి — పెట్టినంతతిండి తిని స్వేచ్ఛ లేకుండా జీవించడంవల్ల. మొఖమాటంవల్ల ఇవాళ బ్రతికుండగా తనమీద, తన సంతానంమీద కరణంగారికి అవ్యాజమైన ప్రేమే ఉండవచ్చు; కాని తను చచ్చింతరువాత రంగాయి మీద కరణంగారికి ఎప్పటికరుణ ఉంటుందా ?

"మీరు... చెప్పింది సబబుగానే... ఉంది కరణంగారూ! కాని, రంగాయి నాకుమల్లే ... పనివాడు కావాలని నాకోరిక. అంతవాడు... కాగలిగితే వాడికాళ్ళమీద వాడే నిలబడగలుగుతాడు. మీరు... కాస్త జోక్యం కలిగించుకుని...ఆ మేస్త్రీ సుబ్బయ్యకు రంగాయిని ... ఒప్పగిస్తే... పని నేర్చుకుంటాడు" భూషయ్య దూరపుఆలోచన నచ్చింది కోదండరామయ్యగారికి. తన బాధ్యతని చిన్నదిగా చేసినందుకు కరణంగారు లోలోపల భూషయ్యను అభినందించారు.

తండ్రిమాటలు వింటూ రంగాయి ముఖం చిట్లించుకున్నాడు. మేస్త్రీ సుబ్బయ్యక్రింద పనినేర్చుకోడం సుతరామూ యిష్టంలేనట్లు ఆ క్షణం వాడి ముఖంలో కలిగిన

మార్పునుబట్టి తేలిగ్గా అర్థంచేసుకోవచ్చు. కాని, ఆ బాధను ఎట్లాగో బలవంతాన అణచుకొని— చావులోఉన్న తండ్రికి కష్టం కలిగించకూడదన్న ఉద్దేశ్యంతో. బూషయ్య "ఏంరా!... నీ కిష్టమేనా! మేస్త్రీ సుబ్బయ్యదగ్గర ఉండటం" — అన్నప్పుడు కిసుక్కున వొణుకుతోన్న పెదాలతో "అవును" అన్నాడు రంగాయి.

అయితే, భూషయ్య కరణంగారు అబ్బాయిని మేస్త్రీ సుబ్బయ్యకు తన సమక్షంలో అప్పగింత పెట్టేవరకూ బ్రతకలేక పోయాడు. ఏదో గొణుగుతోనే ప్రాణాలు విడిచాడు.

"నాన్నా!" అని తండ్రి తలదిండుమీద నిర్జీవంగా వాలిపోయింతరువాత రంగాయి వేసిన కేకకు— వాడి హృదయంలోని వ్యథంతా ఇల్లంతపరిమాణంగా వ్యాపించి ప్రతిధ్వనించిందా అనిపించింది. కరణం కోదండరామయ్యగారు దగ్గర ఉండి కర్మను రంగాయిచాత సలక్షణంగా శాస్త్రీయపద్ధతిలో చేయించి కులంలో పదియిళ్ళ వాళ్ళకు భోజనం పెట్టించారు.

ప్రస్తుతానికి రంగాయిని తనవద్దనే అట్టిపెట్టుకున్నారు, కరణంగారు. రంగాయికి యిదే హాయిగాఉంది. వాడికి మేస్త్రీ సుబ్బయ్య గంభీరఆకారాన్ని చూస్తేనే సహంభయం. అదీగాక అతను మేస్త్రీపని ఎంతకఠినంగా, నిర్దయగా నిర్వహిస్తాడో— తన చేతిక్రిందవాళ్ళను అంతసీచంగా, నిర్లక్ష్యంగా చూస్తాడో చెప్పుకుంటూంటే విన్నాడు, రంగాయి. అటువంటప్పుడు వాడికి మేస్త్రీ సుబ్బయ్యమీద సదభిప్రాయం ఎట్లా కలుగుతుంది? రంగాయి తలచినట్లు జరగలేదు.

కరణంగారు మేస్త్రీ సుబ్బయ్యను పిలిపించి ఉన్న విషయం పొల్లు పొరుపోకుండా చెప్పి, తనతీర్మానంగా ఇలా అన్నారు:—

"సుబ్బయ్యా! ఎంత చెడ్డా ఒక కులంవాళ్లు. ఏదితప్పించుకున్నా తప్పుతుంది కానీ— ఇదితప్పదు. భూషయ్య కంటతడి పెట్టుకొని నాకు మరీమరీ చెప్పాడు. నీదగ్గరుంటే తాపీ పని నేర్చుకొని బ్రతుకు తెరువు సంపాదించుకొంటాడని అందరి ఆశ.

"నాకే ఆరుగురు పిల్లలున్నారు. వాళ్ళను సాకలేక తలప్రాణం తోకకొస్తూన్నది. మధ్యలో వీడా?" అని విసుక్కున్నాడు మేస్త్రీ సుబ్బయ్య.

"ఈ అక్కరకురాని కబుర్లన్నీ నాకు పనికిరావు. నేను ఖచ్చిగా చెబుతున్నాను. రంగాయి భావిజీవితాన్ని నీకు అప్పగిస్తున్నాను. వాడు బ్రతికి బట్టకట్టి ఒకయింటివాడై— నలుగురిలో ప్రజ్ఞకలవాడనిపించుకొంటే ఆ ప్రఖ్యాతంతా నీదే. చెడుతిరుగుళ్ళు తిరిగి కొరగానివాడై నిర్భాగ్యుడైతే ఆ అపఖ్యాతికూడా నీకే వరిస్తుంది. వాడివల్ల నీకు పెద్ద యిబ్బందేమీ ఉండబోదనుకుంటాను. ఇంత కూడు పెట్టండి; తగిన పని చేయించుకోండి" కోదండరామయ్యగారు కొంతవరకు ఒప్పించ గలిగారు కాని, రంగాయిని తనవద్ద ఉంచుకొనే పద్ధతిలో మేస్త్రీ సుబ్బయ్యకు ఇంకోఆలోచన 'ప్రతిఫలం వాంఛించడం' లాంటిది ఉంది. అది తన నోటిమీదుగానే బయట పెట్టటం జరిగింది. ఏమిటంటే— భూషయ్య సంపాదనగా మిగిలిన ఎనిమిది వందల రూపాయల కిమ్మత్తుచేసే యిల్లు

తనకి కావాలిట. మేస్త్రీ సుబ్బయ్యస్వార్థం కరణంగారికి అర్థం కాకపోయినా గత్యంతరం లేదు కనుక ఒప్పుకున్నారు.

కరణంగారు రంగాయిని మేస్త్రీ సుబ్బయ్య వెంట పంపించారు. వాడికి క్రొత్తచొక్కా, లాగు తొడగబెట్టి, ఒక రూపాయి డబ్బులిచ్చి మరీ పంపారు. కరణంగారి యింటిని వదలలేక వాడి పసిహృదయం పడ్డ వేదన, పుట్టి ఆప్యాయంగా ఆరేళ్ళపాటు పెరిగిన కోడెదూడ ఆసామియిల్లువదలి మరో ఆసామియిల్లు చేరుకోవాలంటే పడే వేదనలాంటిదే. ఇక యేడిస్తే బావుండదని పొంగివచ్చే దుఃఖాన్ని కడుపులో దాచుకున్నాడు.

మేస్త్రీ సుబ్బయ్యసంసారం చిన్నదికాదు. భార్య, ముగ్గురు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు, కళ్లులేని ముసలి తల్లి, విధవ చెల్లెలు. ఆ యింట్లో రెండు పార్టీలు. సుబ్బయ్య తటస్థంగా వుంటాడు. బాధ్యతగలవ్యక్తి గనుక, కుటుంబ పోషకుడుగనుక. ఆయనభార్య సుందరమ్మ ఒకటి, చెల్లెలూ, ముసలితల్లీ ఒకటి. నిత్యమూ వాళ్ళల్లో వచ్చే తగాదాలు తీర్చలేక యిరు పార్శ్వముల వారికి సక్రమమైన తీర్పు చెప్పలేక సుబ్బయ్య విజ్ఞానమూ, ఓర్పు, తెలివీ అలసి పోతున్నాయి. తననిగురించి న్యాయమైన జాగ్రత్త తీసు కొంటూన్నప్పటికీ కన్నతల్లి అన్న మమకారం కొడుకుకి లేకపోయిందనీ, అత్తయ్య అన్న జ్ఞానం కోడలికి లేదనీ — తనని పరాయిదానిలాగా, తక్కువరకంగా చూస్తున్నారని ముసలితల్లి గోల; తను దిక్కులేక 'మొగుడుచచ్చి వెధవ ముండై రావటంవల్ల అందరికీ లోకువైందనీ, తనకి ఆస్తి

యేమీ లేకపోవటంవల్లనే అన్నయ్య పంచన పడివుంటూ వదినెచేత మాటలు పడవలసివొస్తూందనీ చెల్లెలు ఘోష; తనమీద లేనిపోని అభాండాలు వేస్తున్నారనిన్నీ, అత్తయ్య ఆడబిడ్డా ఒకటై సంసారం గుట్టుగా చేసుకోనిచ్చేట్టు లేరనీ వారేమో యివన్నీ పట్టించుకోరనీ, తననే తప్పుకు పోతూండ మనీ చెబుతారు — ఎటొచ్చీ తనే అక్కడికి పరాయిదనీ — సుందరమ్మసాధింపు. ఇటువంటి కుటుంబంలో వచ్చిపడ్డాడు రంగాయి.

"వీడు మన కొంపలో దేనికి? నానా అడ్డమైన వాళ్లం దర్నీ మనం పోషించగలమా యేమిటి? ఉన్న పిల్లలకే కట్టు కోను గుడ్డలే లేక నానా అగచాట్లు పడుతున్నామే..." అన్నది సుందరమ్మ చేతులు విలాసంగా గాలిలో ఆడిస్తూ.

"ఊఁ! అప్పుడే మొదలుపెట్టావూ! వాడినేమీ పోషించక్కర్లేదు..." అన్నాడు మేస్త్రీ సుబ్బయ్య గుడ్లురిమి చూస్తూ.

తనకేం పట్టిందన్నట్టు మూతిని మూడువంకర్లుగా తిప్పి యింట్లోకి వెళ్ళింది సుందరమ్మ.

స్తంభానికి ఆనుకొని నిలుచున్న రంగాయి కళ్ళల్లో నీళ్ళు నిండినై.

ఆరోజు రంగాయికి చల్దీ అన్నములో ఎర్రకారపు పచ్చడివేసి బయట వరండాలోపెట్టింది సుందరమ్మ. రంగాయికి ముద్ద మింగుడు పడలేదు. ఆ పెట్టిన స్థలం పరిశుభ్రంగా లేదు. ఆ రాత్రి ఆ వరండాలోనే పండుకున్నాడు. చిరిగిపోయిన చాప యిచ్చారు ప్రక్కక్రింద.

మరునాడు గంట ప్రొద్దు ఉండగానే మేస్త్రీసుబ్బయ్య రంగాయిని లేపాడు. "చావిడంతాఊడ్చి బాగుచేసి గేదెలకు కుడితిపోసి యింట్లోకి కావాల్సిన నీళ్ళుతోడు" అని చెప్పాడు.

రంగాయి కళ్ళు నులుముకొని "ఊఁ!" అన్నాడు నిద్ర మనిషిని గింగిరాలు త్రిప్పుతోంది. వాడికి నిద్ర పట్టలేదు. కొత్తచోటూ కావటం ఒకటీ. వాడు రాత్రి పన్నెండు గంటల వరకూ తనకు జరగబోయే అన్యాయాన్ని గురించి విపరీతంగా ఆలోచించటంవల్లా నిద్రకు దూరుడయ్యాడు. వంగి చాప చుట్టుతూ చాపమీదే మేను వాల్చాడు. "లేవవేమిరా!" అన్న కేకకు ఉలిక్కిపడి లేచి చాపచుట్టి మూలపెట్టి చావట్లోకి వెళ్ళాడు.

ప్రొద్దు రెండుబారలు ఎక్కేవరకూ చావిట్లో పని చేస్తూనే ఉన్నాడు. కసు ఊడ్చేప్పటికి వాడి నడుము పట్టుకు పోయినంత పనైంది. తలనొప్పి ఆరంభమైంది. తనని తాను తిట్టుకున్నాడు. తండ్రిని తిట్టాడు. తను యిక్కడికి రావటానికి కారణం తన తండ్రేనని వాడి నమ్మకం.

"ఏంరా యింకా దొడ్లోనే పాతిపెట్టుకున్నావేం!" అంటూ వచ్చింది సుందరమ్మ. తను వీళ్ళక్రింద జీతగాడా? అంత తేలిగ్గా మాట్లాడటం ఎందుకు? కూటికోసం వీళ్ళ దగ్గర కొచ్చాడా తను? రంగాయి అభిమానానికి గట్టిదెబ్బ తగిలింది. అయితే యేం? ఎదురు మాట్లాడలేదు. అంతా క్రొత్త. మేస్త్రీ సుబ్బయ్యకు కోపంవచ్చి తనని వెళ్ళమంటే? సుందరమ్మకు కోపంవచ్చి తనకు వేళకు అన్నం పెట్టకపోతే? తన గతేంకాను... ఎవర్ని యేమని అడిగేట్టు. చేతిలోఉన్న

పొలిగట్టను క్రిందవేసి సుందరమ్మ వెంట యింట్లోకి వచ్చాడు
కడవా చాంతాడు పట్టుకొని వరలబావిదగ్గర కొచ్చాడు
రంగాయి. వాడికి వరల బావిమీద అటొకకాలూ ఇటొక
కాలూ వేసి కడవతోడే అలవాటులేదు. కెంపు మొగ్గ తోడే
ప్పటికి చేతుల్లోని రక్తమంతా గుమికూడింది. అరచేతులు
కందిపోయినయ్. మరో మూడు జోళ్ళు తోడేప్పటికి పిడి
కడవ జారి బావిలో పడనే పడింది. "ఏమిట్రా అల్లా చేశావ్!
బావిలో కడవ పడవేస్తే ఎవరు తీస్తాననుకున్నావ్. పోయింది
బావిలోకి. నువ్వు మా కర్మకొలదీ ఎక్కడ దాపురించావురా!
పావలా యిస్తేనేకాని, బావిలో కడవ తీయరు" అని కోపంతో
డుతో వడ్డించబోయింది సుందరమ్మ రంగాయిని.

సుబ్బయ్య చెల్లెలు అడ్డువచ్చింది రంగాయి అదృష్టం
కొలదీ "వాడు ఏమిచేశాడని అట్లా కొట్లాటకొస్తావు. జారి
కడవ బావిలో పడితే వాడిదా తప్పు. నువ్వు ఎన్నిసార్లు కడ
వను బావిలో పడవేయలేదు. నిన్నెవరైనా అన్నారా?
పాపం! వాణ్ణి అట్లా చంపుకుతింటావెందుకు!" అన్నది దానికి.

"చాల్ చాల్లే. నీకెందుకు మధ్య, నువ్వేమన్నా వాడికి
కూడు పెడుతున్నావా? గుడ్డ పెడుతున్నావా?" అని
ముఖం తిప్పుకొంది సుందరమ్మ. ఆ మాటకు నోరు నొక్కు-కో
లేదు ఆడబిడ్డ, తోకత్రొక్కిన త్రాచులాగ లేచింది.

"అబ్బో! మహా దొడ్డయిల్లాలు వచ్చింది యింటి
కాలానికిగాను—దానధర్మాలు చేయటానికి మేమేమన్నా
ఎరుగుదుమా! నువ్వు ఎంతమందికి పెట్టినా సరే అన్నయ్య
ఆస్తేగా!"

"అక్కడ మీ అన్నయ్య సంపాదించాడు రెండు చేతులా తింటానికి" అన్నది సుందరమ్మ అపహాస్యంగా—

"కాదు— నీ సంపాదనే!"

"ఇప్పుడు నీకెందుకు ఎవరి సంపాదనైతే—అసలు మా సంపాదనజోలి నీ కెందుకు? నాతో తగువు పెట్టుకుందామని కాకపోతే— " పెద్దగా అరుస్తోంది సుందరమ్మ.

వాళ్ళకు తనమీదగానే పోట్లాట వొచ్చిందని మేస్త్రీ సుబ్బయ్యకు తెలిస్తే తనని కొడతాడని భయపడసాగాడు రంగాయి.

"మాటిమాటికీ దానిమీద ఒంటికాలిమీద పోతావేమే! అది నిన్నేంచేసింది— వాణ్ణి రానియ్యి చెబుతాను" అంటూాన్నది మంచంలోఉండి ముసిలిది.

ఇంతలో మేస్త్రీ సుబ్బయ్య రానేవచ్చాడు. రంగాయి కాళ్ళక్రింద భూమి కదిలింది.

"ఏమి టీ దరిద్రం. ఇంటికి వచ్చేప్పటికి ఏదో ఒక పోట్లాట, తిట్టుకోటాలు. అబ్బబ్బా! నన్ను చంపేస్తున్నారు. ఎందుకొచ్చిం దీ ఉపద్రవం" గొంతు చించుకున్నాడు సుబ్బయ్య. ఎవ్వరూ మాట్లాడలేదు.

ఎప్పుడూ ఉండే తతంగమేనని తగవుకు మూలాధారమైన కారణాల్ని వెతకలేదు సుబ్బయ్య.

రంగాయి ఆ యింట్లో ఒక జీతగాడుగా వ్యవహరింపబడుతున్నాడు. కరణం కోదండరామయ్య గారు రంగాయిని దాదాపు మరచిపోయినారు. రంగాయి తనవద్ద యేఉద్దేశ్యంతో చేరాడో, కరణంగారు తనకి యే ఉద్దేశంతో మరీమరీ చెప్పి

అప్పగించారో, మేస్త్రీ సుబ్బయ్యా కించిత్తుకూడా దృష్టిలో ఉంచుకోలేదు. తనక్రింద రంగాయి నరకంకన్న కష్టమైన జీవితాన్ని గడుపుతున్నాడనేది ఊహకు రానేలేదు.

ప్రత్యహం రంగాయి జీవితం యిల్లా గడుస్తూంది, సంక్షిప్తంగా: ఝాము ప్రొద్దు ఉన్నదనగా లేవటం, చావట్లో పేడకళ్ళు తీయటం దగ్గర్నుంచీ గేదెలపాలు తీయటంవరకూ చేసి, ఇంటిదగ్గర నీళ్ళు తెచ్చి— చద్దిఅన్నం, ఉడుకుఅన్నం–రెండూ కలసిన మిశ్రమ భోజనం చేసి మధ్యాహ్నం వరకూ గొడ్లను పొలాలమీద త్రిప్పుకొని, పల్లెకె పేడవేసుకొని యింటికొచ్చి, రెండోపూట గేదెలకు కుడితి తాపి, మేతదూసి యింట్లో సీళ్లుతోడి, అన్నంతిని, పొలం గడ్డికి వెళ్ళి, ప్రొద్దుక్రుంకేలోపుగా వచ్చి— గేదెల పాలుతీసి రాత్రి తొమ్మిది గంటలకు అన్నం తినేవాడు. వొళ్ళంతా నొప్పులు. నిద్ర రాదు. మళ్ళీ ఝాము పొద్దు ఉన్నదనగా మేస్త్రీ సుబ్బయ్యా కేక. ఏమిటి గానుగఎద్దులాగా కళ్లుమూసుకొని పనిచేయటం? తనెందు కికక్కడకొచ్చినట్టు? మేస్త్రీ సుబ్బయ్యా పనికి తీసుకెళ్ళడేం? ఆయన ఇంటిదగ్గర వెట్టిచాకిరీ చేయటానికే తను ఉంట? చీ చీ వెధవబ్రతుకు. అనుకొనేవాడు రంగాయి, చాటుగా. వామిలో మేత రాక అరచేతుల్లో నెత్తురు గీరలు కమ్మినప్పుడు యేడ్చేవాడు. దుర్గతికి ఒకరోజు మనస్సును స్థిరపరచుకొని—

"నేనుకూడా పనిలోకి వస్తాను" అన్నాడు మేస్త్రీ సుబ్బయ్యాతో.

మేస్త్రీ సుబ్బయ్య కుటిలంగా నవ్వి "ఇంకా నీకు ఆయి చాలదు పనిచేయటానికి. ఇంకా రెండు సంవత్సరాలు పోనివ్వు. అప్పుడు పనికివస్తావు." అన్నాడు.

ఈ రెండు సంవత్సరాలు ఈ బానిసత్వంతో బ్రతుకును పాడుచేసుకోవాల్సిందేనా అనుకున్నాడు రంగాయి. ఆయన ఉద్దేశ్యం యిది కాదనికూడా రంగాయి గ్రహించాడు. తను పనిలోకి పోతే ఇంటిదగ్గర తెమలని పనంతా ఎవరు చేస్తారు ?

తక్కిన విషయాలమీద సుబ్బయ్య ఆశయాలకీ, సుందరమ్మ ఆశయాలకీ భేదాలు వున్నప్పటికీ అర్థికత్వంలో ఇద్దరి ఆశయాలకు ఆ శే భేదంలేదు. ఇటువంటి వ్యక్తులు సమాజంలో చాలామంది ఉన్నారుకానీ కొంతమంది సుబ్బయ్య, సుందరమ్మల మాదిరిగా బయటపడరు. ఆ నేర్పు అనుభవంమీద కానీ అలవడదు. తమ అవసరాలకు యితరవ్యక్తుల్ని వినియోగించుకోవటం సర్వసామాన్యమే; కాని, ఆ వ్యక్తుల్ని కష్టాల పాలుచేయడం దుర్మార్గంకాకపోదు. రంగాయిని,తమ స్వార్థం కోసం ఉపయోగించుకొంటూ వాడ్ని అష్టకష్టాలపాలు చేయటం అన్యాయమని ఏ క్షణమూ మేస్త్రీ సుబ్బయ్య, సుందరమ్మ తలంచలేదు./ పై పెచ్చు వాడ్ని బాగుచేస్తున్నామని తమ ధార్మికత్వాన్ని/లోకానికి చాటుకుంటారు, నిజాన్ని ముసుగులో దాచి. తెరవెనుక సత్యాలను బట్ట బయలు చేయాల్సిన అవసరం — ముఖ్యంగా యిటువంటి విషయాల్లో ఎవరికుంటుంది ? దిక్కు దివాణంలేని భూషయ్య కొడుకుని ఎంత కులాభిమానం, దయాస్వభావం లేకపోతే

తనదగ్గరకు చేరదీస్తాడు — అనుకున్నారు చాలామంది. కాని, రంగాయి అనుభవించే దుర్భరజీవితం ఎవరి కర్థమౌతుంది ?

ఆ యింట్లో పిల్లలకికూడా రంగాయిమీద సానుభూతి లేదు. పెద్దవాళ్ళనుబట్టే పిల్లలుకూడాను. పిండివంట చేసుకున్నా, మంచికూర వండుకున్నా సుందరమ్మ రంగాయికి పెట్టే పనిలేదు. మేస్త్రీ సుబ్బయ్యా పెట్టమని భార్యతో అనడు. ఎప్పుడన్నా సుబ్బయ్యా చెల్లెలు చాటుగా రంగాయికి పెడుతుంది. ఆవిడకు రంగాయిమీద అభిమానంకంటె జాలి ఎక్కువగా ఉంది.

ఒకరోజు సాయంత్రం మేస్త్రీ సుబ్బయ్యా కరణం కోదండరామయ్యగారికి బజార్లో కనబడ్డాడు. మాటల సందర్భంలో "రంగాయి ఎలా ఉన్నాడు ? రోజూ పనిలోకి తీసుకుపోతున్నావా ?" అన్నారు కరణంగారు.

మేస్త్రీ సుబ్బయ్యాకు ఏం జవాబు చెప్పాలో తోచలేదు. కరణంగారిదగ్గర అబద్ధం ఎట్లా ఆడేది ? ఏమైనా ఆ క్షణంలో సుబ్బయ్యాకు అంతకంటె గత్యంతరం కనబడలేదు.

"తీసుకెళుతున్నాను" ముక్తసరిగా జవాబు చెప్పాడు. అనృతం అన్నిచోట్లా ఎల్లవేళలా అక్కరకు రాకపోయినా తాత్కాలికంగా దాని ప్రభావం ప్రమాదాన్ని, అగౌరవాన్ని ఎదుర్కొనే పద్ధతిలోనే ఉంటుంది.

కరణంగారు ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే కౌశలం గలవారన్న సంగతి మేస్త్రీ సుబ్బయ్యాకు విదితమే. తరువాత విచారించి తన బండారాన్ని బయట వెయ్యగలడని భయపడి మేస్త్రీ సుబ్బయ్యా మరునాడు రంగాయిని షావుకారుగారి

పనిలోకి తీసుకెళ్లాడు. సుందరమ్మ అభ్యంతరం చెప్పినా చెల్లలేదు.

రంగాయి చేయవలసినపని : గానుగ వేసిన సున్నమును తట్టలతో డాబాపైకి తీసుకురావటమే. అట్లా సున్నం మోసే వాళ్లు రంగాయికాక నలుగురు ఉన్నారు. మొదట ఒకటి రెండు గంటలు తేలిగ్గా ఉన్నప్పటికీ, తరువాత తరువాత డాబా ఎక్కటం చాలా కష్టమనిపించింది. కాళ్లు నొప్పులు ఆరంభించాయి. ఈ పని సుఖంగా లేదనిపించింది రంగాయికి. వాడు ఒకటిరెండుసార్లు మేస్త్రీ సుబ్బయ్యచేత హెచ్చరింపబడ్డాడు, పని తొందరలేదని. ప్రొద్దున వస్తూ వస్తూ ఎనిమిది గంటలకు తినివచ్చిన చద్దిఅన్నపు శక్తి పదిగంటలకే తరిగిపోయింది. ఆకలి వేస్తూంది. ఇంకా రెండుగంటలు పనిచేయాలి. కూర్చుంటే ఊరుకోరు. ఆ రెండుగంటలూ పని చేసేప్పటికి రంగాయి నడువలేని స్థితిలోకి వచ్చాడు.

రోజులు గడచినకొద్దీ రంగాయికి అంత కష్టమనిపించుట లేదు. ప్రతిరోజూ వాడు సంపాదించే కూలి మేస్త్రీ సుబ్బయ్య తన కుటుంబఖర్చుకే వినియోగించుకుంటున్నాడు. బజార్లో ఏదన్నా కొనుక్కుతిందామన్నా అణాడబ్బు లివ్వడు. మేస్త్రీ సుబ్బయ్య కర్కశత్వం అర్థంకాలేదు రంగాయికి. తను చెమట్లు పట్టేటట్టు పనిచేసి సంపాదించిన డబ్బు మీద తనకి ఎందుకు అధికారం లేకుండాపోయింది? ఈ మేస్త్రీ సుబ్బయ్య ఎవడు తన డబ్బు దిగమింగడానికి? ఆయన పిల్లలు చేగోడిలు, పకోడీలు— పంచదారగోలీలు తింటూం

టూరే! —తనెందుకు తినకూడదు? తన నాలుకకు తీపి యొక్క రుచి తెలియదా? అని రోషపడేవాడు రంగాయి.

ఒకరోజు తనతోపాటువాళ్లు సినిమాకు వెళుతూంటే "ఒక్క పావులా ఇవ్వు. నేనుకూడా సినిమాకు వెళతాను" అని అడిగాడు రంగాయి.

సుబ్బయ్య ఒక్క నిముషంపాటు కన్నురెప్ప లార్పకుండా చూశాడు. "వెధవ! నీకు సినిమాకు నేనెక్కడ డబ్బులిచ్చేది?" అన్న భావం రంగాయికి గోచరించింది. సుందరమ్మ అందుకున్నది:

"వేలెడు లేవు నీకు సినిమాలట్రా! వెధవా? ముప్ఫై యేళ్ళవాళ్ళం మేము ఎన్నడైనా సినిమాలు చూసి ఎరుగుదుమా?"

ఇట్లా రంగాయి ఆ కుటుంబంలో ప్రతి విషయానికీ ప్రతి అవసరానికీ అణగగొట్టబడుతున్నాడు.

ధనం ఉన్నవాడ్ని లక్ష్మి ఎట్లావరిస్తుందో దిక్కులేని వాడ్ని కష్టాలు అట్లా ఆవరిస్తాయి. అది భగవంతుని లీలలని కొందరు అభోహాపడతారు, మరికొంతమంది మానవ కల్పితములైనపరిస్థితులమూలంగా నేనని అభిప్రాయపడతారు. రంగాయికి మానవుల ఆదరణ లేకపోవటం నిర్భాగ్యం వల్లనే కావచ్చు కానీ భగవంతుని ఆదరణకూడా లభించకపోవడంతో వాడి దురదృష్టమే ననవచ్చు.

ఒకరోజు శంకరయ్యగారి డాబామీదకు ఇటుకరాయి మోస్తూంటే నిచ్చెనజారి క్రిందపడ్డాడు రంగాయి. బలమైన దెబ్బలు తగిలినయ్. నేలమీాద ఉన్న నిచ్చెన అడుగుభాగం

జారిందా? మెట్లు ఎక్కుతోన్న రంగాయికాళ్ళు జారినాయా? నిజం యేమిటంటే రంగాయి ప్రొద్దున అన్నం తినిరాలేదు చద్దిఅన్నం లేకపోతే. అందుచేత పదకొండు గంటలను నిర్భరమైన ఆకలిమంట బయలుదేరింది. కాళ్ళల్లో సత్తువ క్రుంగిపోయింది. నిచ్చెన ఎక్కుతోంటే కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి. ఎండను చూడలేకపోతున్నాయి. తలమీద ఇటుకరాళ్ళతట్ట బరువు అరికాళ్ళవరకూ ప్రాకుతోంది. పని త్వరితం లేదని మేస్త్రీ సుబ్బయ్యా నిర్దాక్షిణ్యమైన కేకలు, నరాలలో ఎర్రని ఆకలి, కళ్ళల్లో లంకాదహనపుజ్వాలలు, అటువంటి సమయంలో పడిపోయాడు రంగాయి. మేస్త్రీ సుబ్బయ్యా సహితం దైవవశాత్తు రంగాయి పడిపోయాడని విశ్వసించాడు.

రంగాయి బ్రతుకుకు నిరీక్షణసమయం ఆసన్నమైంది. వాడికి తలమీద, భుజంమీద ప్రమాదకరమైన గాయాలే తగిలినవి. వాడ్ని జాగ్రత్తగా—అంటే చావకుండా చూడవలసిన బాధ్యత మేస్త్రీ సుబ్బయ్యాకుటుంబంమీద సంపూర్ణంగా ఆధారపడి ఉందని వేరే చెప్పనక్కర్లేదు. కాని వాడికితగినచికిత్స లభించ లేదు. తన కుటుంబానికి మందిచ్చే నాటువైద్యుణ్ణి సుబ్బయ్యా నియమించాడు. ఆ మందువల్ల రంగాయి గాయాలకు ఉపశాంతి చిక్కకపోగా నొప్పి మరింత తీవ్రమైంది. వాడికి రాత్రీ పగలూ నిద్రలేదు. వాడ్నిగురించి సబబైన జాగ్రత్త తీసుకొనే మనిషి ఆ యింట్లో లేదు. సుందరమ్మ సరే సరి. సుబ్బయ్యాకు తీరికలేదు; ఎటుగూడీ ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా సుబ్బయ్యా చెల్లెలే మందులివ్వడమూ, విసనకర్రతో ఈగల్ని విసరడమూ చేస్తూంటుంది. వాడికి సుంద

రమ్మ తన ముఖాన్ని చూపించలేదు సరిగదా ఇంకో అప చారం చేసింది. వాడిమంచం గొడ్లచావట్లో వేయించింది. ఒకప్రక్కన పెంటపోగు, మరోప్రక్కన గొడ్లరొచ్చు, ఈగలు, దోమలు, కుక్కిమంచంలో రంగాయి. రాత్రిళ్ళు గాయాల బాధతో వాడువేసే వెర్రికేకలకు లేచి ఒదార్చేవాళ్ళు లేరు. దాహమైతే మంచినీళ్ళిచ్చే దిక్కు లేదు. గాయాలకు చీము పడితే లోషను పొడుముతో కడిగేవాళ్లు లేరు. వైద్యుడు ఒకరోజు రాకపోతే అడిగేవాళ్ళు లేరు. రంగాయికి రాత్రిళ్లు పీడకలలు వచ్చేవి. గొడ్లు రాక్షసులయ్యేవి. చెట్లు దెయ్యా లయ్యేవి.

రంగాయికి ఉపచర్యలు జరపకపోయినప్పటికీ సుంద రమ్మ గొణగటం ఆరంభించింది. "ఇంట్లో ఉన్నాడుగా ఒక దరిద్రపుగొట్టువాడు. పైగా వాడికి చాతలు. దిక్కులేనివాడికి దిక్కుకల్పించిందికాక యిదొకటి పైపెచ్చు. ఇంట్లోచాకిరీ చేయలేని వెధవ బయట డాబాలమీదకు ఇటుకరాళ్లు మోస్తాడా ? అంత శక్తిలేని దద్దమ్మ పనిలోకి పోతానని ఊగులాడటం దేనికీ ?"

ఈ మాటలు రంగాయి విని అవమానం భరించటం కంటె చావటం మేలని గొంతు నులుముకోబోయాడు కాని చేతులు పట్టు పట్టలేదు. ప్రాణంకంటె ప్రియమైందీ విలువైందీ మరొకటిలేదని పసిబిడ్డకుకూడా తెలుసు.

కరణంగారు రంగాయిని చూచేందుకు వచ్చి పరిస్థి తంతా గ్రహించి మేస్త్రీ సుబ్బయ్యను నిందించారు. వాణ్ని నిలువునా చంపేందుకు చూస్తున్నావన్నారు. మంచి డాక్టర్ను

ఎందుకు నియమించలేదని ప్రశించారు. గొడ్లపాకలో రోగిని ఉంచాల్సిన అవసరమేమిటని నిగ్గదీశాడు. ఒక్కటే వాక్యం అన్నారు కరణంగారు సుబ్బయ్య గుండెలకు తాకేట్లు వాడు చెమటోడ్చి సంపాదించే డబ్బును తింటూన్నప్పుడు వాడికి వైద్యం చేయించటానికి వెనుకాడటమేమిటి?

మేస్త్రీ సుబ్బయ్య బుద్ధిగడ్డితిన్నదని ఒప్పుకున్నాడు. మరునాడే మంచి డాక్టర్ను పిలిపించి రంగాయి మంచాన్ని యింట్లో వేయించి వాడిదగ్గర చెల్లెల్ను ఉంచాడు. రంగాయిది కూడా మొండిఘటమేనని చెప్పాలి. వాడికింకా భూమిమీద గింజలున్నాయి. గాయాలు వారంరోజులలోనే మానుముఖం పట్టాయి. అయినప్పటికీ వాడు మళ్ళీ మామూలు మనిషి కావటానికి రెండునెలలు పట్టింది. మేస్త్రీ సుబ్బయ్య మళ్ళీవాడ్ని పనిలోకి ప్రవేశపెట్టలేదు. ఇంట్లోపనిచేసే జీతగాడిక్రింద అట్టే పెడదామనుకున్నాడు. సుందరమ్మ వాంఛకూడా అదే. ఆవిడ ప్రత్యేకంగా చెప్పింది.

"వాడు పనిలోకి పనికిరాడు. ఇంటి పనులకు వినియోగించుదాం. వాడికి కావల్సింది తిండీ బట్టేగదా. మనం బిచ్చగాళ్ళకు పడవేయటంలేదా, రోజూ యింత అన్నం; దానిదేముంది భాగ్యం."

రంగాయిగతి అంతే అయింది. వాడిలో మునుపటి శక్తి యింకా చేకూరలేదు. గాయాలు మానినవన్న మాటే కాని, జబ్బువచ్చి శరీరం చిక్కిపోతే ఎప్పటి శరీరంగా మార్చుకొనేందుకు బత్తాకాయలు, చక్కెరకేళీలలాంటి ఫలాలు తినే చాలామందిని చూడటం అటుంచి, మేస్త్రీ సుబ్బయ్య రెండో

కొడుకుకు అయిదురోజులు జ్వరంకాస్తే చిక్కి శల్యమైనాడని ఎక్కడలేని ఫలాలు తెప్పించి పెట్టి, రోజూ ప్రొద్దున ఇడ్డెను పెట్టి. పైగా ఈ బలం చాలదేమో నన్నట్లు బలంమందు సీసాలు త్రాగటం చూశాడు. తను తలిదండ్రులులేని దౌర్భాగ్యుడు. తనకల్లా జరగమంటే ఎట్లా జరుగుతుంది ? పూరి గుడిసెలో నివసించేవాడు తను ఐదంతస్తుల అందాల మేడలో ఉంటే ఎంత బావుటుం దనుకుంటాడో, పూటకు గతిలేని దరిద్రుడు తను పంచభక్ష్య పరమాన్నంతో సుష్టుగా భోంచేస్తే ఎంత హాయిగా ఉంటుం దనుకొంటాడో, భార్యలో అందాన్ని చూడలేని ప్రేమికుడు తనకు తిలోత్తమలాంటి ప్రేయసి లభిస్తే ఎంత మధురమైన జీవితాన్ని గడపవచ్చునని అనుకొంటాడో, బీడీలకు పైసాముట్టని దిమ్మరి తనకి లాటరీలో లక్ష రూపాయలు వస్తే ఎట్లా ఖర్చుచేయాలని ఆలోచిస్తాడో, అయిదోక్లాసు తప్పిన విద్యార్థి తనకి సరస్వతీదేవి ప్రసన్నమై ఒక్కసారి బి. యే. ప్యాసయ్యే తెలివిని ప్రసాదిస్తే అమ్మా నాన్నని ఎంత సంతోషపెట్టవచ్చునని అనుకుంటాడో — రంగాయికూడా తనకి ఎప్పటి శక్తినిచ్చే పదార్థాలు లభిస్తే ఎంత దివ్యంగా ఉంటుందో ననుకున్నాడు. ఇట్లా తక్కువ స్థితిలో ఉన్న వాళ్లు ఎక్కువస్థితిలో తాముంటే బహుపసందుగా ఉంటుందని కలలు కనటం సహజం. వాడివొంట్లో ఇంకా పచ్చిపుళ్ళ ఛాయలు కొద్దో గొప్పో ఉండటంవల్ల యేపని చేయబోయినా అపరిమితమైన బాధగా ఉండేది. తలితండ్రుల్ని తలుచుకొనేవాడు. వాళ్ళేఉంటే తనకిన్ని కష్టాలు వొచ్చేవికావని వాడి విశ్వాసం. ఒకరోజు—సుందరమ్మతో,—

"నేను నీళ్ళు తోడలేను — చేతులు బొబ్బలెక్కుతున్నాయి" అన్నాడు జాలి చూపులతో.

ఆవిడ రంగాయి తనకు ఏదో సాకు చెబుతున్నాడని భావించింది. "నీకు అన్నం పెట్టలేక మా చేతులు బొబ్బలెక్కుతున్నాయి. సరైతే అన్నం మానుకో" అన్నది సుందరమ్మ ఇంకేం మాట్లాడుతాడు రంగాయి? అన్నం మానుకుంటే బ్రతికేది ఎట్లా? అసలే యిప్పుడు తనకి ఎక్కడలేని ఆకలి, దరిద్రానికి తోడు. అప్పుడప్పుడు వాడికి పారిపోవాలని తోచేది. వెంటనే ఎక్కడికి పారిపోవాలి, తనకి అన్నం ఎవరు పెడతారు అన్న సందేహాలు పట్టుకొని తనకట్లా తోచటం సమంజసంగా లేదనుకొనేవాడు. రంగాయిని ఇంకోవిధంగా ఉపయోగించుకొని డబ్బు సంపాదించాలనే ఆలోచన మేస్త్రీ సుబ్బయ్యకు కలిగి, అట్లా చేశాడు. ఊళ్లో జీతగాళ్ళులేని ఆసాముల గొడ్లను రంగాయి కాచుకొచ్చేట్టు యేర్పాటుచేశాడు. మొత్తం పదిహేను గేదెల వరకూ రంగాయి కాచుకురావాలని మేస్త్రీ సుబ్బయ్య ఆజ్ఞ. గేదెల్ని కాచుకురావడం రంగాయికి పెద్ద కష్టమైన పనిగా అనిపించలేదు. ఇది పరువు తక్కువపని అని అసలేఅనుకోలేదు. గేదెను నెల కాచుకొచ్చినందుకు ఆరణాలు ఇస్తారు. పదిహేను ఆరణాలు ఐదు రూపాయల పది అణాలు, నెల తిరిగేప్పటికి మేస్త్రీ సుబ్బయ్యకు ముట్టేవి.

రంగాయి ఒక చిన్నయంత్రం. ఆ యంత్రంచేసే పని వల్ల ఆదాయం మేస్త్రీ సుబ్బయ్యకు లభిస్తుంది. యంత్రం పనిచేసేందుకు కావాల్సిన పదార్థాలు సుబ్బయ్య యిస్తాడు.

పెట్టుబడిలేని లాభం మేస్త్రీ సుబ్బయ్యది. యంత్రం మనిషి చేతిలోని కీలుబొమ్మ. రంగాయి మేస్త్రీ సుబ్బయ్య చేతిలోని కీలుబొమ్మ.

ప్రతి సంవత్సరమూ ఆ వూళ్లో రథోత్సవం వైభవంగా జరుగుతుంది. ఆసంవత్సరంకూడా వైభవంగా జరిగే ఏర్పాట్లు చెయ్యబడ్డాయి. సాయంత్రం అయిదు గంటలకు ఉత్సవం. వీధినిండా జనం కన్నులపండువుగా ఉన్నారు. మిఠాయి దుకాణాలు అపరిమితంగా ఉన్నాయి. సోడాకొట్లు, కిల్లీ దుకాణాలు, పీచు మిఠాయిపెట్టెలు, పండ్ల దుకాణాలు, ఫ్యాన్సీకొట్లు ఒక టేమిటి 'కాయ్‌రాజా! గుర్రం కాళీ, ఒంటె కాళీ' జూదరి దుకాణాలు—అన్నింటికంటే ముఖ్యంగా పిల్లల్ని ఇట్టేఆకర్షించే రంకులరాట్నం ఉత్సవానికొక ప్రత్యేకతను కల్పిస్తున్నాయి.

సుందరమ్మ తన కొడుకుల్నందర్నీ ముస్తాబుచేసి పంపింది. చిన్నకూతురు మూడేళ్ళదానికి సిల్కుగౌను తొడిగి, మెడలో ఒక చిన్న గొలుసు వేసి, చేతులకు రెండు ఉంగ తగిలించి—

"ఒరేయ్! రంగాయ్, అమ్మాయిని ఉత్సవానికి తీసుకు వెళ్ళరా! జాగ్రత్త! నగలు ఉన్నాయి. ఎక్కడ తిరుగుతావో ఏమిటో! వస్తువు పోయిందా నీ వొళ్లు వొలిచి దండానికి ఆర బెడతాను. తెలిసిందా" అంది. తలఊపి అమ్మాయిని అందుకొని చంకలో యిరికించుకుని సాగిపోయాడు.

లావుపాటి మోకులు రెండు ఎనభై గజాలవరకు పరచి ఉన్నాయి. వాటితో ప్రజలు రథం లాగుతారు. ఆ ఉత్సవం ప్రతి సంవత్సరము చూసేదైనా రంగాయికి ఒక

వింతరకమైన ఆనందమూ, దానివెంట దుఃఖమూ కూడా కలిగాయి. అక్కడున్న తన యీడు ప్రతి పిల్లవాడూ క్రొత్త గుడ్డలు ధరించి జేబులో అణో, బేడో ఉంచుకొని కిలకిల లాడుతూ, మోకులమీద నడుస్తూ, ప్రక్కకి తొలగుతూ మహా సంతోషంలో ఉన్నారు. అటువంటి సంతోషాన్ని రంగాయి పొందలేకపోవటానికి ముఖ్య కారణాలు వాడు క్రొత్తగుడ్డలు ధరించలేదు. వాడిజేబులో చిల్లికానీలేదు. పైపెచ్చు చంకలో పిల్ల ఉన్నది.

రథంమీదకు దేవుణ్ని ఎక్కించారు. మేళాలు జోరుగా మోగుతున్నాయి. ప్రజల్లో గోల బయలుదేరింది. అప్పుడే కొంతమంది మోకును చేతిలో పట్టుకున్నారు. "హార!హారా!" అంటున్నారు కొంతమంది. పిల్లలు చాటుగా కొంతమంది రథంపైకి ఎక్కి దేవుడు చాటున దాక్కొంటున్నారు. కుమ్మరి వాళ్ళు రథం చక్రాలకింద కుండలతో వండిన అన్నంపోసి, గుమ్మడికాయలు పెట్టారు. పూజారి సెలవిచ్చాడు రథం బయలుదేరవచ్చునని. రథం ప్రక్కలకు పోకుండా ఉండగలందు లకు చప్పాలువేసేవాళ్ళు నడుముకు పైపంచలు బిర్రుగాచుట్టి రెడీగా ఉన్నారు. మోకులను ప్రజలు ప్రక్కకు లాగకుండా ఉండేందుకు పెత్తనగాళ్లు కర్రలు చేతపట్టుకుని తిరుగుతు న్నారు. ఇదంతా రంగాయి రామకృష్ణయ్యగారి అరుగుమీద ఉండి చూస్తున్నాడు. జనం క్రిక్కిరిసి ఉన్నారు. ఇసుక వేస్తే రాలనట్టుఉంది జనప్రవాహం. జనంలో కల్లోలం జరక్కుండా ఉండేందుకు కామోసు పోలీసులుకూడా వచ్చారు. లాఠీలు తీసుకొని జనాన్ని నెట్టివేస్తున్నారు.

రథంక్రింద పడుతారేమోనని. రథం బయలుదేరి వెళు తూంటే రంగాయి హృదయం నిండు సంతోషంతో ఊగిసలా డింది. వాడూ కొంతదూరం రథంవెంట వెళ్ళాడు. ఆ జనంలో ఊపిరాడక చంకలోవున్న పిల్ల కెవ్వుమన్నది. వాడు వెనక్కి తగ్గాడు. కొబ్బరాకులతో, రంగు రంగుల కొత్తగుడ్డ లతో, బజారునిండుగా వెళుతూన్న రథాన్ని తిలకిస్తూ, రథాన్ని చూసేందుకు వచ్చిన ఆడవాళ్ళు తిరిగి తమ యిళ్ళకు మరలుతున్నారు. పడమట సూర్యుడు రథాన్ని చూసే కాబోలు ఆనందంపట్టలేక ఎర్రగా నవ్వుతున్నాడు అనుకు న్నాడు రంగాయి. రథం ఊరిచివర మర్రిచెట్టువరకూ వెళ్ళి తిరిగివస్తుంది. మళ్ళీ తిరిగిరావటానికి కనీసం అరగంటైనా పడు తుంది. అప్పటివరకూ ఉందామనుకున్నాడు కానీ సుందరమ్మ 'గేదెపాలు తీయాలి. త్వరగా రా!' అని చెప్పినట్టు జ్ఞాపక మొచ్చి యింటిముఖంపట్టాడు. పొరుగూళ్ళనుంచి వచ్చిన జనంకూడా వెళ్ళిపోతున్నారు.

సుందరమ్మ జాగ్రత్త అని ఒకటికి మూడుసార్లు చెప్పిన సంగతి జ్ఞాపకం వచ్చి పిల్లమెడవంక చూశాడు రంగాయి. తళ తళ మెరుస్తోవుంది గొలుసు. సంతృప్తిపడ్డాడు. వ్రేళ్ళవంక చూశాడు, ఎడమచేతికి పెట్టిన ఉంగరం ఉంది. కానీ...కుడి చేతికి పెట్టిన ఉంగరం లేదు.

వాడిగుండెలు అలిసిపోయినయ్. కొంతదూరం ఆదుర్దా. కొద్దీ వెనక్కు వెళ్ళి వెతికాడు. కనపడలేదు. ఎట్లారా భగ వంతుడా? అనుకున్నాడు. శరీరంనిండా తెలీకుండానే చొక్కా తడిసేట్లు చమటపోసింది. వాడి కళ్ల ముందు సుందరమ్మ కనిపిం

చింది. "వస్తువు పోయిందా — నీవాళ్లు వాలిచి దండానికి ఆరబెడతాను" నిజం. నిజంగా అంతే చేస్తుంది. అంతపనీ చేయగల మనిషే. ఏమిటి కర్తవ్యం? మేస్త్రీ సుబ్బయ్యా బ్రతకనిస్తాడా! సర్వే బెత్తాలతో వాళ్ళువాచేటట్లు కొట్టకుండా ఉంటాడా? తన బతుకు యింతటితో ఆఖరు. తన చావుకే వచ్చింది ఈ తిరణాల. ఎట్లా ఆ దెబ్బల్ని భరించడం? కనీసం కూడు పెట్టకుండా మాడ్చుతారే! రోజు రోజంతా తిట్టిపోస్తారే! పారిపోతే? బాగానేఉంది ఆలోచన! అయితే ఎక్కడికి పారిపోవటం?...ఏమో! ఎక్కడకైనా సరే — ముందు యీ ప్రమాదంనుంచి బయటపడాలి. తరువాత సంగతి తరువాత. చివరకు అడుక్కైనా బ్రతకొచ్చు. ఆపళంగా పారిపోవాలని అనుకున్నాడు. కాని చంకలో పిల్ల అర్థంకాకుండా చూస్తోంది.

బయట చావిట్లోకి తీసుకువచ్చాడు రంగాయి పిల్లను. వాడికాళ్ళు వొణికిపోతున్నాయి. తను ఏదో గొప్పనేరం చేస్తూన్నట్టు వాడిమనస్సు తెలుస్తోంది. మెల్లగా చావిట్లో పిల్లను దించి "యింట్లోకి వెళ్లు అమ్మాయి" అని చెవిలో చెప్పాడు.

ఆ పిల్ల యింట్లోకి పరుగెత్తింది. రంగాయి బయటికి పరుగెత్తాడు.

చీకటి పడుతోంది. వెన్నెలరోజులు కావు. ఆ రాత్రి ఆ వూళ్లోనే ఏదో ఒకమూలను ఉండదలుచుకోలేదు రంగాయి. ఉంటే తప్పకుండా మేస్త్రీ సుబ్బయ్యా వెతికించి పట్టుకుంటాడు. తరువాత తనకు దేహశుద్ధి జరక్కుండా ఉండదు.

అందుచేత వాడు ఏమైనాకానీ ఆ రాత్రి ప్రయాణం చేయాలని నిశ్చయించుకున్నాడు.

బస్తీరోడ్డెక్కాడు. అక్కడికి బస్తీ ఇరవై రెండు మైళ్ళుంది. నడిచి వెడుతున్నాడు. వాడి హృదయంలో దడ తగ్గలేదు. రోడ్డుకు రెండువైపులా చింతచెట్లూ, మర్రిచెట్లూ ఉన్నాయి. చీకటి, జనసంచారం తక్కువ. లోపల భయంగా ఉన్నా రంగాయి పట్టుదలకొద్దీ నడుస్తున్నాడు. తొమ్మిది గంటలు కావస్తోంది. ఆకలి అవుతోంది. మరోప్రక్కన దాహం అవుతోంది. కొంచెందూరంలో వెలుతురు కనిపించింది. అదొక చిన్న పల్లెటూరు.

ఆ రాత్రికి నాలుగిళ్ళదగ్గర యింత అడుక్కుని తిని బజారుఅరుగుమీద పండుకొని నిద్రపోయాడు రంగాయి. మరునాడు తెల్లవారిం తరువాత లేచి నడక ఆరంభించాడు. ఆకలి అయినప్పుడల్లా అడుక్కొని తింటూ వాడు నాలుగు రోజులు ప్రయాణంచేశాడు. మొత్తంమీద రంగాయి 60 మైళ్ళ దూరంవరకూ పారిపోగలిగాడు. అక్కణ్నుంచి అడుగు ముందుకు వేయలేకపోయాడు. కాళ్ళు వాచినయ్. విపరీతమైన నొప్పులు పుడుతున్నాయి.

ఒక రాత్రిపూట ఒకయింటి అరుగుమీద పడుకుని — కాళ్ళతీపులను భరించలేక — "అబ్బ !... అమ్మో !... దేవుడా ! ... అబ్బబ్బా !... ఉస్" అనుకుంటూ బాధ పడుతున్నాడు. సుమారు రాత్రి పదిగంటల ప్రాంతం. ఆ యింటి యిల్లాలు తలుపు తెరుచుకు వచ్చింది. రంగాయి మూలుగుతున్నాడు. వాణ్ణి చూస్తే ఆవిడకు జాలి వేసింది.

"ఏవూరురా అబ్బాయి నీది" అన్నది ఆవిడ.

రంగాయి మూలుగుతోనే ఊరిపేరు చెప్పాడు.

"ఎందుకొచ్చావు ఈ వూరు ? అంతదూరనుంచి" అన్నది ఆవిడ.

"దిక్కులేని వాణ్ని—" అని యేడ్చాడు రంగాయి.

ఆవిడ యింట్లోకి తీసుకెళ్ళి భోజనం పెట్టింది. పండుకోనేందుకు ఒక కుక్కిమంచం, గొంగళి యిచ్చింది. ఆవిడ దయార్ద్ర స్వభావానికి రంగాయి ఆవిడను హృదయంలో ఆకాశాన కెత్తివేశాడు. ఆ యింటి యజమాని అడిగాడు :

"ఇట్లా ఊళ్ళు పట్టుకు తిరక్కపోతే కుర్రవాడివి దిక్కు లేనప్పుడు ఎవరిదగ్గరన్నా జీతాని కుండరాదూ !" తను మేస్త్రీ సుబ్బయ్యదగ్గర ఉండి చేసిన వెట్టిచాకిరీ అంతా జీతగాడు చేసేదేనని తెలిసినా రంగాయి తాను ఇతర్లదగ్గర జీతాని కుండి బ్రతుకుదామని ఎన్నడూ అనుకోలేదు. అట్లా ఉండడం వాడికి నామర్దాకాదు.

"నన్నెవరు పెట్టుకుంటారు జీతానికి" అన్నాడు రంగాయి.

"ఏం, నువ్వు నమ్మకస్తుడివి కావా ?" అన్నదావిడ.

రంగాయి తన కథంతా వాళ్ళకు వినిపించాడు. ఎందువల్లనంటే ఈకుటుంబంలో తను జీతగాడుగా స్థిరపడిపోతే తన కింక చింతలేదని వాడు తలిచాడు. ఆ దంపతులమీద వాడి కంత విశ్వాసం ఏర్పడింది.

"నాకు మీరు జీతం ఏమీ ఇవ్వవద్దు. అన్నంతిని మీ దగ్గర పనిచేస్తాను." అన్నాడు రంగాయి. ఆమాట అనటా

నికి వాడెంత దుస్థితిలో ఉన్నాడో వాళ్ళకు తేలిగ్గా అర్థమైంది. "సరే, నువ్వు ఊరికే నే మాకు దేనికి? ఏదో తోచినంత నువ్వు పనిచేసినకొద్దీ సంవత్సరం చివర ఇస్తాంలే. ఇక్కడే ఉండి పనిచెయ్యి" అన్నాడు యజమాని.

మేస్త్రీ సుబ్బయ్యకూ, ఈ యజమానికీ పోలికెక్కడా అనుకున్నాడు రంగాయి. ఆ క్షణంలో మేస్త్రీ సుబ్బయ్య పరమ దుర్మార్గుడుగానూ, యజమాని మానవోత్తముడుగానూ కనిపించారు.

* * * * *

వాళ్ళది సామాన్యమైన రైతుకుటుంబం. వాళ్ళకు ఒక్కగా నొక్క పిల్లవాడు. పదహారేళ్ళవాడు. ఊళ్ళో హైస్కూల్లో స్కూలుఫైనలు చదువుకున్నాడు. యజమాని నరసయ్య ఎప్పుడూ పొలంపనిలోనే నిమగ్నుడై ఉంటాడు, రాత్రిళ్ళుతప్ప. ఇంటి యిల్లాలు నారాయణమ్మ గుణవంతురాలు. గుణాల్లో నరసయ్యకూ, (రంగాయి లెక్కప్రకారం) మేస్త్రీ సుబ్బయ్యకూ ఎంత తారతమ్యం ఉందో నారాయణమ్మకూ, సుందరమ్మకూ అంతే తారతమ్యం ఉంది. మనుష్యుల్లో యింత మంచివాళ్ళు ఉంటారనేది వీళ్ళదగ్గర పనిచేయనారంభించిన తరువాతనే రంగాయి తెలుసుకోగలిగాడు.

రంగాయికి చాలా తక్కువపని ఆ యింట్లో. పేరుకు జీతగాడన్నమాటే కానీ కొడుకుకు జరుగుతోన్న గౌరవమే వాడికీ జరుగుతోంది. ప్రొద్దునపూట చావట్లో పేడకళ్లు తీయటం — గేదెలకు కుడితి పెట్టడం — అన్నంతిన్న తరువాత గేదెల్ని పొలం తోలుకువెళ్ళడం, అంతే. సాయంత్రంకూడా

గేదెల్ని గురించి వాడు నీళ్లు తోడక్కర్లేదు. అంట్లు తోమక్కర్లేదు. దొడ్లో మేతగూడా దూయనక్కర్లేదు. ఆ పనులు నారాయణమ్మ, నరసయ్యలు అవకాశం ఉన్నప్పుడు చేసుకుంటూంటారు.

తిండి విషయంలోకూడా రంగాయికి బాగా జరుగుతున్నది. వాళ్లు ఏ కూర వండుకున్నా రంగాయికూడా ఉన్నాడనే దృష్టితోనే వండుకుంటారు. పిండివంటలు వండుకుంటే పెడతారు. రంగాయి కేవలం జీతగాడనే దృష్టి కాకుండా వాళ్ళకు వాడిమీద దిక్కుమాలినవాడని అయితేనేమి, కుర్రవాడని అయితేనేమి ప్రత్యేకమైన దయ ఉంది. అది వాడి అదృష్టంగా పనిచేస్తో వాడికి ఏ లోటు లేకుండా చూస్తోంది.

ఒకసారి వాడికి జబ్బు చేసింది. ఒకరోజులో పోతుందనుకొన్నది వారం రోజులవరకూ తిరుగుముఖం పట్టలేదు. నరసయ్య ఊళ్లో పేరుమోగిన డాక్టర్ను తీసుకొచ్చి చూపించాడు. మందులిప్పించాడు. నారాయణమ్మ రోజూ కాఫీ కాచియిచ్చేది. తరువాత జబ్బు మరో వారంరోజులకు నయమైంది. తనకి రోగంవాస్తే ఇక్కడ తనకు జరిగిన పరిచర్యను, అప్పుడు డాబామీదనుంచి పడ్డప్పుడు అక్కడ జరిగిన పరిచర్యను పోల్చి చూచుకొని రంగాయి జన్మలో అటువంటి నరకంలో పడవేయవద్దని భగవంతుణ్ని ప్రార్థించేవాడు.

మానవుడి భవిష్యత్తు ఎప్పుడూ ఒకేరకమైనస్థితిలో ఉండదు. నేడు ఆనందంగా జీవించేవాడు రేపు దుఃఖంతో కుమిలిపోవచ్చు. ఒక క్షణంలో సంతోషంగా ఉండేవాడు

మరుక్షణంలో విచారంలో మునగవచ్చు. అంతా సంఘటనల మీద ఆధారపడి ఉంటుంది.

ఆ సాయంత్రం,........

రంగాయి దొడ్డి ఊడుస్తున్నాడు, ఉషారుగా ఏదో సినిమాపాట ఆలాపించుతూ. గేదెలు మోరలెత్తి ఆ పాటను వింటూన్నట్టు చూస్తోన్నవి. గాలికి కొబ్బరిచెట్ల ఆకులు గల గల మంటున్నాయి. ఇంటి వెనకగా అస్తమించే సూర్యుని ఎర్రని కాంతి.

ఇంతలో నరసయ్య ముగ్గురు మనుష్యులను వెంటబెట్టు కొని వచ్చాడు. అందులో ఒకడు మేస్త్రీ సుబ్బయ్య. రంగాయికి తెరచిన గుడ్లు తెరచినట్టుగానే ఉండిపోయినాయి ఆ ఒక నిముషంసేపు. ప్రస్తుతంఉన్న జత ఎడ్లను అమ్మి గిత్తలను కొనాలని నరసయ్య అభిలాష. అందుచేత బేరం పెట్టాడు. మేస్త్రీ సుబ్బయ్య స్నేహితుడొకడు చౌకలో ఎడ్లను కొనవలెనని యింతదూరం సుబ్బయ్యను తీసుకు వచ్చాడు.

రంగాయిని చూడగానే మేస్త్రీ సుబ్బయ్య చలిం చాడు. రంగాయి జాడ తెలుసుకొనేందుకు మేస్త్రీ సుబ్బయ్య చాలా ప్రయత్నాలు చేశాడు — ముఖ్యంగా కరణం కోదండరామయ్యగారు వొత్తిడి పెట్టటంచేత. సుంద రమ్మకూడా వెతకమనే చెప్పింది. ఆవిడకు రంగాయే ఉంగరం దొంగిలించాడనే గట్టి నమ్మకం ఉంది. మేస్త్రీ సుబ్బయ్యకు అంత నమ్మకంలేదు.

"చూడండి ఎడ్లను. నచ్చితే ఆపైన బేరం ఆడవచ్చు" అన్నాడు నరసయ్య ఒక ఎద్దును తోకపట్టుకుని అదలించి.

రంగాయి ఇంట్లోకి వెళ్ళాడు. వాడికి భయమేస్తోంది. సుబ్బయ్య తనని తీసుకెళతాడేమో!

"ఎక్కడి కెక్కడ నచ్చటంలేండి? బేరం చెప్పండి" అన్నాడు సుబ్బయ్య స్నేహితుడు. ఖాయదాదారుడు ఎడ్లకు యేయే స్థానాల్లో సుళ్ళు ఉన్నవో చూస్తున్నాడు. సుబ్బయ్య రంగాయి ఆలోచనలోనే ఉన్నాడు. ఎల్లాగన్నాసరే వాడ్ని యిక్కడ్నుంచి తీసుకెళ్ళాలి.

"ఇదివరకు చాలామంది నాలుగొందలయాభైకు అడిగి వెళ్ళారు. నేను అయిదు వందలకు చిల్లిగవ్వ తగ్గనని చెప్పాను. సరే, మీరు ఎంతకు అడుగుతారో అడగండి. ఇష్టమైతే..." అన్నాడు నరసయ్య.

"ఏదో_ఆ నాలుగువందలయాభై చేసి యిచ్చేయండి" అన్నాడు ఖాయదాదారు.

"అట్లాగైతే యిన్నిరోజులు అట్టేపెట్టటం దేనికి! అమ్ముకోలేకనా" అన్నాడు నరసయ్య.

"ఇక అంతకు తగ్గనంటారా?" అన్నాడు సుబ్బయ్య మిత్రుడు. ఈ బేరంలో సుబ్బయ్య జోక్యం కలిగించుకోలేదు.

"మరోమాట చెప్పండి" అన్నాడు ఖాయదాదారు.

"ఇక నేను చెప్పేదిలేదు. మీరే యేదో తేల్చండి" అన్నాడు నరసయ్య.

"ఇంకో పదిరూపాయలు చేసుకోండి" అన్నాడు ఖాయదాదారు.

"నేను యిన్నిసార్లు బేరం చెప్పలేను. ఆఖరిబేరం చెబుతున్నాను. నాలుగువందల డెభ్భైఅయిదు రూపాయలకైతే తీసుకోండి. లేదంటారా తిరుగుముఖంపట్టండి"

తరువాత రెండుసార్లు అడిగినా నరసయ్య చిల్లి కానీ తీసివేయలేదు. చివరకు అంతకే ఒప్పుకున్నాడు సుబ్బయ్య స్నేహితుడు; తిరిగిన బేరాలలోకంటే యిదే కొంచెం చౌకగా కనబడటం వల్ల.

ఆ రాత్రి తన యింటిదగ్గరే విశ్రమించమన్నాడు నరసయ్య. మేస్త్రీ సుబ్బయ్య స్నేహితుడు సందేహించాడు కానీ సుబ్బయ్య అంగీకారం తెలిపాడు, రంగాయి అంతు కనుక్కుందామనే ఉద్దేశ్యంతో.

భోజనాలైన తరువాత పంటల విషయంలోనుంచి మేస్త్రీ సుబ్బయ్య రంగాయి విషయంలోకి మార్చాడు సంభాషణని; రంగాయి ఏ క్షణంలో యేం ముంచుకొస్తుందో అన్నట్టు గోడచాటునఉండి వింటున్నాడు.

"మీ యింట్లో ఉండే ఆ కుర్రవాణ్ణి యిలా పిలుస్తారా" అన్నాడు సుబ్బయ్య. రంగాయి గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నవి. పారిపోదామనుకొన్నాడు కాని కాళ్ళు రాలేదు.

"ఎందుకు ?" అన్నాడు నరసయ్య.

"వాడు మావాడే— రెండు నెలలకిత్రం మా యింట్లోంచి పారిపోయి వచ్చాడు" అన్నాడు మేస్త్రీ సుబ్బయ్య.

"అల్లాగా! ఎందుకు పారిపోయి వచ్చాడు?" అన్నాడు నరసయ్య.

"తిరణాలను చూపించేందుకు మా అమ్మాయిని తీసుకొచ్చాడు బజారుకు. దాని చేతిలోని ఉంగరం కాస్తా పోయింది. క్రిందజారిపోనీ, ఎవరన్నా తీసుకోనీ—యిక వాణ్ణి కొడతామనే ఉద్దేశ్యంతో ఇటు పారిపోయి వచ్చాడు. వాడ్ని రెండు నెలల నుంచి వెతికిస్తున్నాను. పేపర్లో కూడా ప్రకటించాను జాడ తెలిసిన వారికి యాభైరూపాయలు బహుమానం యిస్తానని. వాడు దిక్కులేని వాడు. తండ్రి చనిపోతూ పోతూ కరణం కోదండరామయ్యగారి ద్వారా నాకు అప్ప చెప్పి వెళ్ళాడు నా దగ్గర పని నేర్చుకుంటాడనే ఉద్దేశ్యంతో. చివరకు ఈపనిచేశాడు. కరణంగారు ఇప్పుడు నాగొంతుమీద కూర్చున్నారు. 'రంగాయిని ఏంచేశావని ?' ఊళ్ళో చాలా మందిలో పుకార్లు బయలుదేరినయ్. నేను తలెత్తుకొని బజార్లో తిరగలేకపోతున్నాను. మా ఆవిడ రంగాయిని గురించి ఒకటే దిగులు పెట్టుకుంది. నా వెంట పంపించండి"

ఎట్లా కాదనటమో అర్థంకావటంలేదు నరసయ్యకు. తన పిల్లవాడ్ని తానువచ్చి 'నావెంట పంపించమంటే' కాదనటానికి తనెవడు ? వాడిమీద తనకు హక్కు ఎక్కడుంది ? ఏదో గతిలేనివాడని అన్నంపెట్టి పనిచేయించుకున్నంత మాత్రాన వాడు తనవాడౌతాడా ? రేపు రచ్చకెక్కితే నలుగురూ 'నీదేమి అధికారం' అంటారు. తన రెండు కొచ్చిందిమధ్యలో. స్వభావంకొలదీ ఆదరించాడుతను. అంతే.

"సరే అట్లాగే తీసుకెళ్ళుదురుగాని, మీ కుర్రవాణ్ని మేము ఉంచుకోటానికి మాకు ఎక్కడిది హక్కు?" అన్నాడు నరసయ్య.

నారాయణమ్మ భర్తమాదిరిగానే తలంచి ఊరుకుంది. రంగాయి విపత్కర పరిస్థితిలో పడ్డాడు. ఏమైనా తను మేస్త్రీ సుబ్బయ్యవెంట పోకూడదనుకొంటున్నాడు. నరసయ్య ఒప్పుకోవటం వాడికి దుర్మార్గంగా కనిపించింది.

"రంగాయిని పిలిపించండి" అన్నాడు మేస్త్రీ సుబ్బయ్య.

"రంగాయి, ఒరే రంగాయి" కేకవేశాడు నరసయ్య. రంగాయి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి నిలబడ్డాడు. తల వంచుకున్నాడు. ముఖంలో నెత్తురుచుక్క లేదు. అది వాడి అయిష్టతను వ్యక్తీకరిస్తోంది పాపం! వెళ్ళటాని కిష్టంలేదు కాబోలు అనుకున్నాడు నరసయ్య. కాని తను మాటిచ్చాడు. పంపించాల్సిన బాధ్యత తనది.

"ఏంరా! సుబ్బయ్యగారు రమ్మంటున్నారు పోతావా!" అన్నాడు నరసయ్య.

రానని అనటానికి ధైర్యంలేదు రావటానికి యిష్టం లేదు. మాట్లాడలేదు రంగాయి. దుఃఖాన్ని మింగుడుపడ జేసుకుంటున్నాడు.

"రాక ఏంజేస్తాడులెండి. మీ దగ్గర బాగా తినటానికి అలవాటుపడ్డాడులాగుంది." అన్నాడు మేస్త్రీసుబ్బయ్య లేని నవ్వును తెచ్చుకుంటూ.

*    *    *    *

తొలి కోడి కూసింది.

మేస్త్రీ సుబ్బయ్య స్నేహితులు సుబ్బయ్యను లేపారు ఇంటికి వెళ్లేందుకు. నరసయ్యకూడా లేచాడు. మసక చీకటి బాగావుంది. ఇంకా తెల్లవారటానికి కో గంట వ్యవధి వుంది. అందరూ చావట్లోకి నడిచారు. ఎద్దు మోరలెత్తి చూశాయి. నరసయ్య ఒక యెద్దును విప్పి నీళ్ళ తొట్టిదగ్గరకు తీసుకు వెళ్ళాడు. మేస్త్రీ సుబ్బయ్యకు ఇంకా నిద్రమత్తు సరిగ్గా వద లేదు. ఆయనకు రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు. ఏవో వికృత మైన కలలొచ్చాయి.

"రంగాయి లేచాడా?" అన్నాడు మేస్త్రీ సుబ్బయ్య చలిగా వుండటంవల్ల పైపంచ తలకుచుట్టుకుంటూ.

"లేవనట్లుంది. ఆ బండిజల్లలో పండుకొని వుంటాడు లేపండి" అన్నాడు నరసయ్య.

బండి జల్లలో చూశాడు మేస్త్రీ సుబ్బయ్య. లేడు. ఆయనకు గుండె ఆగినంతపనైంది. తెల్లవారుఝామున తమ కంటే ముందు లేచి పారిపోయాడేమో!

"లేడండి—"అన్నాడు మేస్త్రీ సుబ్బయ్య ఆశ్చర్యంగా.

ఏమైనట్టు?

చావడీ ఇల్లూ అంతా వెతికారు. రంగాయి జాడలేదు. నారాయణమ్మకూ అర్థంకాలేదు-రంగాయి ఎక్కడికివెళ్లాడో! వాడికి మేస్త్రీ సుబ్బయ్యతో పోవటం ఇష్టంలేక ఎక్కడికో పారిపోయి ఉంటాడు. ఈ అభిప్రాయానికి అందరూ రావ టానికి ఎక్కువకాలం పట్టలేదు.

మేస్త్రీ సుబ్బయ్యకు విచారంకన్న కోపం అధికమౌతున్నది. వెధవ—తప్పించుకొని ఎక్కడుకు వెళతాడో చూస్తాను అనుకున్నాడు. చాలాసార్లు, నరసయ్య, నారాయణమ్మలకు విచారం వేసింది. వాడట్లా పారిపోవటానికి తామే కారణమని బాధపడ్డారు.

బాగా తెల్లవారింది. ఎడ్లను ఊరివెలుపలివరకూ తోలి పెట్టి ఇంటికి వెళ్ళాడు నరసయ్య.

ఊరి పొలిమేర దాపున తుమ్మల చెరువుంది. అక్కడ ముఖాలు కడుక్కుందామని ఎడ్లను చెట్లకు కట్టివేసి ముఖం పుల్లలు విరిచారు. మేస్త్రీ సుబ్బయ్యకు రంగాయిని గురించి ఉన్నకోపం యింకా తగ్గలేదు.

చెరువుగట్టుమీద కొచ్చారు మేస్త్రీ సుబ్బయ్యా, స్నేహితుడూనూ. చెరువులో ఏదో శవం తేలుతూన్నట్టు మేస్త్రీ సుబ్బయ్యకు అగుపడింది. కొంత శ్రమతో ఆ శవం రంగాయిదని తెలుసుకొనేప్పటికి మేస్త్రీ సుబ్బయ్య గుండెలో చీకట్లు కమ్మినయ్............

ఒకళ్ళ స్వార్థానికి వాడు బలిఅవుతూ, ఆ స్వార్థాన్ని ఎదుర్కొనే సమర్థతను కలిగిఉండలేక — రంగాయి తన అల్పజీవితాన్ని సమాప్తి చేసుకోవటంతో తృప్తి పడ్డాడని మీరూ, నేనూ అందరూ తలంచి వాడి ఆత్మను శాంతిని కలిగిద్దాం.

# పరోపకారి

గోపాలకృష్ణయ్య బాగా తిరిగి నేర్చినవాడు. పైగా వ్యవహారకర్త కూడాను. ఆయన వేలుపెట్టిన వ్యవహారం గెలవకుండా పోవడం ఇంతవరకు జరగలేదని ప్రతీతి. మళ్లీ బాగా చదువుకున్నవాడు కాదు. ఆ అయిదో తరగతిచదువే, చదువు; కాకపోతే కాలంపూసుపోక రామావధాన్లు దగ్గర చదివిన రామాయణ, మహా భారతాలు చదనటం వరకే కాని, వాటి వల్ల గోపాలకృష్ణయ్య వ్యవహారదక్షతని నేర్చుకున్నదిలేదు. గోపాలకృష్ణయ్య తండ్రి నిపుణుడు. ఆయన్ని ఎరిగున్న వాళ్లు ఆయన లక్షణాల్లో ఎక్కువ భాగం గోపాలకృష్ణయ్యకు అలవడ్డాయని అనటంకూడా కద్దు. ఏమైనా మనం గుర్తించవలసింది ఒకవ్యక్తిలోని గుణగణాలు వంశపారంపర్యంగా వొచ్చినవనికాదు, స్వశక్తివల్ల ప్రస్తుతం అతనికున్న స్థాయిని గమనించాలి.

లెస్సగా చదువుకొన్నవారితో, గౌరవనీయులతో, ప్లీడరులతో, రాజకీయపెద్దలతో చాలామందితో గోపాలకృష్ణయ్యకు పరిచయముంది. ఆ పరిచయాన్ని ఎటువంటి క్లిష్ట పరిస్థితుల్లో కూడా జారవిడుచుకోనే, అంతరాయం కలిగించే దుస్థితిపాలు చేయకుండా నైపుణ్యంగా కార్యకలాపాలు నెరవేర్చుకుంటున్నాడు. అయితే మనం చిక్కిలిగా ఆశ్చర్యపడవలసిందేమంటే— అతనికి కొడుకులమీద కంటేకూడా కూతుళ్ళమీద ప్రేమ, మక్కువ ఎక్కువ. ఇది సహజంగా

పురుషులలో వుండే లక్షణంకాదు. అతను కొడుకులకు ఆస్తి సంపాదించి పెట్టలేదు. కొన్ని పరిస్థితుల్లో "కొడుకుల్ని" కొడుకులుగా కూడా చూడలేదు. మరి ఆయనకు అంతపగ కొడుకులమీద యెందుకు కలిగిందో కనుక్కోన్న వాళ్ళె వరూలేరు. చిత్రమేమంటే విశేషించి మాటల్లో, తిట్లుతిట్టి, నానా దుర్భాషలాడి కొడుకులమీద తనకున్న ద్వేషాన్ని వెలువరించడు. తను చేయవలసిందీ, చేయదలచుకుందీ గుట్టు చక్కగా, రహస్యంగా ఆచరణలో చేసేస్తాడు. ఇందులోనే వుంది ఆయన నైపుణ్యమంతా.

గోపాల కృష్ణయ్యకు ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు. ముగురు కొడుకులకీ అయినకాడికి అంటే యిచ్చిన కట్నానికి అంగీకరించి మంచీ చెడ్డలు విచారించే పనిలేకుండా పెళ్ళిళ్లుచేసి భాగాలు పంచాడు. పెద్దకూతుర్ని కాస్త నాలుగురాళ్లు సంపాదించే వాడికి యిచ్చాడు. రెండోకూతుర్ని ప్రక్క వూళ్లో ఆరెకరాలు కలవాడికి యిచ్చాడు. కొడుకులతోపాటు తనూ సమమైన పాలు పంచుకున్నాడు. ప్రతి సంవత్సరమూ యిద్దరు కూతుళ్ళనీ యింటికి రప్పించి మంచి చీరెలు పెట్టి పంపుతూండేవాడు.

సంసారవాదంలో గోపాల కృష్ణయ్యకు ప్రత్యేకమైన అభిప్రాయాలు లేకపోవటం శోచనీయమైన విషయమే. విధవా వివాహాల్ని అతను ఎన్నడూ నిరసించలేదు కూడా. అలాగే ముసలివాళ్లు పెళ్ళి చేసుకున్నా అతనికి ఇబ్బందిలేదు. డబ్బునుగురించి ఆయనకుండే అభిప్రాయాలు అమూల్యమైనవి. డబ్బును సంపాదించటమే ముఖ్యధర్మంగా యెంచు

కొని ప్రవర్తించేవాళ్ళంటే గోపాల కృష్ణయ్యకు పడనిమాట వాస్తవమేకాని, అతని వాదం – ఆ ప్రవర్తనలోనే కొన్ని నాగరికమైన మార్పులు రావాలనీ, కేవలం ధనంమీద ఆశ వుండి, ప్రతి పనీ అందుకొరకే చేస్తున్నట్టు అగుపడ కూడదనీ. ఆయన ధనం సంపాదించాడు కాని ఆ సంపాదించటంలో కొంత నేర్పును ఉపయోగించాడు. అందువల్ల చెడ్డపేరు సంక్రమించ లేదు. సాధారణంగా పెద్దమనుష్యు లనబడేవాళ్లు చేసే కొన్ని వంకర పనులు, గోపాలకృష్ణయ్య తాను చేయకుండా వెనక ఎత్తునవుండి చేయించేవాడు. తన అవస రాల్ని తీర్చుకొనేందుకుగాను వసుధా తెలివికలవాడు కనుక గ్రామవ్యవహారాల్లో, గ్రామసింహాలకి అనువుగా వుండి, ఇటు ప్రజలచేత మాటలు పడకుండా, కోటా వొచ్చినప్పుడు గోధు మలు కానీ, పంచదార కానీ, గుడ్డలు కానీ సరిపడ్డన్ని తెచ్చు కొనేవాడు. ఇంకో ముఖ్యవిషయ మేమిటంటే జత యెద్దు లేకపోయినప్పటికీ, స్వంత వ్యవసాయం లేకపోయినప్పటికీ బండి పట్టాలు ప్రథమంలో తెచ్చుకొని "బ్లాకు" లో విక్ర యించి అధికలాభాన్ని పొందేవాడు. గోపాల కృష్ణయ్య ఆడంబరప్రియుడు కాడు. మామూలు దుస్తులు ధరించే జరుపుతాడు వ్యవహారాన్నంతా. ఇంతకీ చెప్పొచ్చిం దేమి టంటే, గోపాలకృష్ణయ్య స్వార్థపరుడనీ, ఆతని అభిమాన మంతా కూతుళ్ళపై నే వుంటుందనీ, కాని ఆ రెండు లోపాల్ని కప్పిపుచ్చుకొనే దక్షత, నేర్పుకూడా ఆయనలో వున్నవనీ. ఇన్ని వ్యవహారాల్లో జోక్యం కల్పించుకొంటూవున్నా అతనికి అంతో యింతో శాంతి లభిస్తూనేవుంది. కొడుకుల సంసారా

లోని లోతుపాతులను సవరించే బాధ్యత ఆయనమీాద లేదు కనుక, పెద్దకూతురూ, అల్లుడూ సక్రమంగా నే వుంటున్నారు కనుక, రెండో కూతురు ప్రక్క గ్రామంలోనే వుంటుంది కనుక—ఆదుర్దాపడవలసిన అవుసరంలేక ప్రమాదాలకు దూరంగా, నిశ్చింతగా వుండే అవకాశం సంభవించింది.

కాని, ఈమధ్యనే రెండోకూతురు విషయమై కొన్ని దుర్వదంతులు ప్రాకిపోయినయ్. అల్లుడు అంతకంతకూ తిరుగుబోతువాడవుతున్నాడనిన్నీ, భార్యను కొట్టి తిడుతున్నాడనిన్నీ, దుస్సహవాసం అధికమైందనిన్నీ — ఇన్ని వదంతుల మూలంగా గోపాలకృష్ణయ్య ఆదుర్దా కలిగి, వెంటనే చిన్నకూతురు దగ్గరకు వెళ్ళటం జరిగింది.

వొచ్చీరావటంతోనే చిన్నకూతురు హైమవతి తండ్రిని కౌగలించుకొని—

"నాన్నా! యిక్కడ నేను వుండలేను" అని కంట నీరు కార్చింది.

గ్రహించాడు గోపాలకృష్ణయ్య. తను కొన్నిరోజుల పాటు అవశ్యంవుండి చిన్నకూతురు జీవితాన్ని చక్కబరచటం మేలు అని కూడా అనుకున్నాడు. "ఫరవాలేదమ్మా! అధైర్యపడకు. అంతా నేను చక్కబరుస్తాను" అని కూతురికి ధైర్యం చెప్పాడు.

హైమవతి మామ గుడ్డివాడు, అత్త కుటుంబాన్ని ఈదుకురాగల సమర్థురాలుకాదు. ఇక ఆడబిడ్డ కృష్ణవేణమ్మ వుంది కాని బహు మేదకురాలు. ఒకళ్ళకు ఏ పరిస్థితుల్లో కూడా ఎదురుచెప్పే స్వభావం కలది కాదు. పదిహేడు ఏళ్లు

వొచ్చినాయి. ఇంకా ఆమెకు పెళ్ళి చేయలేదు. ఇకపోతే ఆ యింట్లో హైమవతి భర్తకు ఎదురుచెప్పేవాళ్లు ఎవ్వరూ లేరు. అందువల్ల అతని అధికారానికి అంతు దొరక్కపోతు న్నది. ఆయనగారికి వృద్ధాప్యంలోనే యిద్దరు ఉంపుడుకత్తెలు. అతని పేరు శివరాం.

రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికివొచ్చాడు. తన మామని చూచాడు. కూతురుని చూచేందుకు వొచ్చేడు కాబోలు అనుకున్నాడు.

బయట మండువా వసారాలో వియ్యంకుల కబుర్లు జోరుగా సాగుతున్నవి. తన కొడుకు దౌష్ట్యాన్ని గురించి గోపాలకృష్ణయ్యకు వివరిస్తున్నాడు, గ్రుడ్డి వియ్యంకుడు.

"నేనేమో అంధుణ్నాయె! ఏది ఎట్లా జరుగుతూందో మీ వియ్యపురాలు వివరించిందాకా నాకు తెలీకపోయె. అయినా నే నెన్ని అన్నా యేమిలాభం వుంది. నామాట ఆల కిస్తాడా, పెడతాడా! అక్కడికీ నోటిదురద వొదిలించుకునేం దుకు అంటూనేవుంటా, చెవిని పెడితేగా! పైగా కసురుకుం టాడు. ముక్కును తాండవమాడుతూంటుంది, కోపం. దాని మాటా వినడాయె! మొన్న వడ్లుఅమ్మగా వొచ్చిన తొమ్మిది వందలరూపాయలకూ యిప్పుడు వందరూపాయలు వున్నవి. అదేమిరాఅనే వీలులేకపోయె. ఎట్లా వీడితోవేగాలో మాకు అర్థంగాదు. పైపెచ్చు ఆపిల్లది అడ్డుచెప్పిందని దాన్ని పట్టుకు వృథాగా కొడతాడు. ఇదుగో కృష్ణయ్యగారూ! మీరన్నా కాస్త నయానో భయానో చెప్పి వాణ్ణి సక్రమమార్గంలో పెట్టండి."

ఇదంతాఆలకించాడు శివరాం. ఈ ప్రకారమేకనక తన మామ తనమీద అధికారం చెలాయిస్తే, ఇంక తనంత అసమర్థుడు, అప్రయోజకుడు వుండబోడు. అయినా తనకుటుంబం మధ్యలోకొచ్చి యిరికి, అధికారం చేపట్టటానికి యీాయ నెవరు ? అనుకున్నాడు శివరాం.

ఆరాత్రి భోజనా లయింతరువాత కదిలించిచూశాడు, గోపాలకృష్ణయ్య.

"అబ్బాయీ! శివరాం, తలిదండ్రుల్ని పోషించవలసిన బాధ్యత నీమీాదవుంది. దాన్ని గమనించకుండా దుస్సహావాసాలుచేసి, చెడుఅలవాట్లకు అలవాటుచుకొని భార్యనీ, తలిదండ్రుల్నీ హింసించటం సబబుగాదు. తలిదండ్రులపట్ల కొడుకు ధర్మాన్ని సరైనపద్ధతిలో నిర్వహించటం నీవంతు. నా మాట విని, ఈ కొంగాను సహవాసాలు మానేసి, పొలంవెళ్ళి పాటుపడకపోయినా కూలీలచేత దగ్గరుండి పనులుచేయించుకో."

శివరాం తలవొంచుకొని కూచున్నాడు. లోపలహృదయంలో మామమీాద అంతులేనికోపం రగులుతున్నది కాని అణిచిపెట్టుకుంటున్నాడు. మామసంగతులు తెలుసు, శివరాంకు.వ్యవహారజ్ఞానంతో ఎంతపేరు సంపాదించాడోకూడా తెలుసు. ఎదురుచెప్పటానికి జంకాడు. మొదట్నుంచీ మామమీాద శివరాంకు ఒకవిధమైన గౌరవభావమేవుంది.

మరునాడురాత్రికూడా శివరాంకు బోధలుచేశాడు. శివరాం వుక్కినపేనులాగా గోపాలకృష్ణయ్య చెప్పిందంతా ఆలకించాడు. ఆపైన ఆచరించేవిషయం ఆలోచనకు వొదిలేసి, ఇంతటితో తనపని అయిపోయిందని తృప్తిపడలేదు గోపాల

కృష్ణయ్య. ఒక్కవారంరోజులుపాటైనా వుండి తనఅల్లుడి ప్రవ ర్తనని సాకల్యంగాగుర్తించి అవసరమైన సవరణలుచేసి సల హాలు యిద్దామని వుండిపోయేడు. పాపం! శివరాం—"రేపెళ తాడు మామ, ఇవా ళెడతాడు మామ" అని యేరోజు కా రోజు ముళ్ళమీాద నిలుచున్నట్టు రోజుల్ని గడుపుతున్నాడు. ఈలోపల "రేపో, యెల్లుండో వెళదా" మని అనుకొంటూ వున్న గోపాలకృష్ణయ్యకు మరొక గమనార్హమైన బాధ్యత భుజస్కంధాలపైన మోపబడింది.

ఒకరోజుమధ్యాహ్నం, మాటలసందర్భంలో కృష్ణవే ణమ్మ పెళ్ళివిషయమై ప్రస్తావనజరిగింది.

"దానికి పెళ్ళిచేయాలంటే మా వలనుపడకుండా వుంది. వరుళ్ళనువెతికే శక్తి మా దగ్గర లేదు. వాడిని చూస్తే ఆపోకిళ్ళుపోతున్నాడు గోపాలకృష్ణయ్యగారూ! అన్యథాఅనుకోకుండా దానిపెళ్ళివిషయమై మీారు కాస్త పని కల్పించుకొని మీాకునచ్చినవరుణ్ణి యేరి ఆకాస్తా మీా చేతుల మీాదుగానే జరిపించండి. అది మట్టుకు "కర్మమా!" అంటూ ఎన్నాళ్ళని పుట్టింట్లో వుంటుంది." అని గ్రుడ్డివియ్యంకుడు అన్నాడు.

ఈ విషయాన్నే కొద్దిమార్పులతో కొంచెంజాలిగా, వివరంగాఅన్నది వియ్యపురాలు.

గోపాలకృష్ణయ్య తనలోతాను నవ్వుకున్నాడు. పైకి గంభీరంగా—"సరే! చూస్తాను. నాకు మీాకంటె ఆప్తు లెవ రున్నారు కనుక" అన్నాడు.

మరొకవారంరోజులు అక్కడే వున్నాడు, గోపాల కృష్ణయ్య.

* * * * *

రామచంద్రయ్య కొడుకు పెళ్ళికిగాను, గోపాల కృష్ణయ్య ప్రక్కగ్రామం వెళ్ళవలసివచ్చింది. రామచంద్రయ్య బలవంతంమీద. ఆ వూళ్లో గోపాలకృష్ణయ్యని ఎరిగిన పెద్దమనుష్యులు చాలామంది వున్నారు. ముఖ్యంగా జానకిరామయ్య, బాల్యంనించీ స్నేహం. పెళ్ళికాగానే పండుకొనేందుకు జానకిరామయ్య యింటికి వెళ్లాడు.

జానకిరామయ్య గోపాలకృష్ణయ్యకంటె రెండుమూడు సంవత్సరాలు పెద్దవాడైనప్పటికీ దృఢంగా, కంటిచూపులో ఎటువంటి లోపం లేకుండా వున్నాడు. అయితే ఒకటి, జానకిరామయ్యకి కుటుంబంలేదు, భార్య లేదు, పిల్లలు లేరు. రెండోసంబంధం భార్య రెండునెలల క్రిందటనే — క్షయ వ్యాధితో మూడు సంవత్సరాలు తీసుకొని చచ్చిపోయింది. ఇంకా జానకిరామయ్యకు ఓ పిచ్చినమ్మకం గట్టిగా వుంది, తనకు మూడోపెళ్ళి గీతవుందని. అభిలాష కూడా అదే. ఎవరన్నా నవ్విపోతారనే చిన్నతనం అసలే లేదు. ఆ అభిప్రాయాన్నే చూచాయగా గోపాలకృష్ణయ్య దగ్గర వెలువరించాడు.

"గోపాలకృష్ణయ్యా, ఈకాలంలో ముసలివాళ్లు పెళ్ళి చేసుకుంటే లోకులు ఏమంటారు ?" అన్నాడు జానకి రామయ్య.

గోపాలకృష్ణయ్యహృదయం గతుక్కుమన్నది. గ్రహించాడు జానకిరామయ్య మనోభావాన్ని. కాని ఆశ్చర్య పడలేదు.

"ఏమనుకుంటారు. అనుకుంటేమాత్రం చేసుకో దలచిన వాళ్లు ఆగటం దేనికి? ఎవరియిష్టం వాళ్ళది. ఇందులో ఒకళ్లు అవుననే దేమిటి, కాదనే దేమిటి, ముసలివాళ్ళకు కన్యనిచ్చే దాతలుండాలేకాని" ఇట్లా గోపాలకృష్ణయ్య ప్రోత్సహించటం, జానకిరామయ్యకు అంతులేని ఆనందాన్ని కలిగించింది. మనసులో వేయి దణ్ణాలు పెట్టుకున్నాడు. ఆ పిమ్మట తన మనస్సులోవున్న భావాన్ని మెల్లిగా ఇలా బయటపెట్టాడు జానకిరామయ్య.

"నాకు జాతకంలో మూడోపెళ్ళి గీత ఎటుగూడివుంది. నాకుకూడా చేసుకోవాలనే వుంది. కాని భయపడుతున్నాను" అన్నాడు.

"ఈ అభిప్రాయం నీబోటివాళ్ళకు ఉండవలసిందికాదు. దాని కేమిటిలే? నీ యిష్టం వొచ్చినరీతిగా మనస్సును వుపయోగించుకొని సాధ్యమైతే ఆచరణలోపెట్టు, జానకిరామయ్యా! మూడోపెళ్ళి చేసుకోవాలనే అభిలాష నీకు పూర్తిగా వుందికనుక ఆ మోజును తీర్చుకో! కానీ, నే చెప్పేదికూడా విను. ఇది అందరికీ విడ్డూరంగా కనబడితే కనబడవచ్చు. అంతమాత్రంచేత భయపడటం అవివేకం. నీకు పన్నెండెకరాల నిక్షేపమైన మాగాణీభూమి వుంది. ఆస్తికి కొదువలేదు. అందుచేత యే బీదపిల్లనో వివాహ

మాడితివా, ఆ పిల్ల బాగుపడుతుంది." అన్నాడు గోపాల కృష్ణయ్య.

ఈ అభిప్రాయం జానకిరామయ్యకు నచ్చింది. తన మూడో పెళ్ళికి యింతమాత్రం ప్రోత్సాహం ఇచ్చేవాళ్ళు కనపడకే జానకిరామయ్య యింతగా వగవటం. ఒకళ్ళిద్దరు ఏమాత్రం పిల్లని వెదికి వివాహానికి సిద్ధం చేసిపెట్టినా, కనీసం వివాహంచేసుకోవటం యేమంత విడ్డూరంకాదని చెప్పినా, ఇదివరకే పెళ్ళిచేసుకొనేవాడు. అటువంటిదేమీ జరక్కపోవ టాన్నే గోపాలకృష్ణయ్యమాటలు జానకిరామయ్యలో నూతనోత్సాహాన్ని రేకెత్తించటానికి పనికివొచ్చాయి.

"నేనుకూడా అదేఅనుకున్నాను, కృష్ణయ్యా! ఈ నాకున్న ఆస్థిలో సెంటుపొలంకూడా వారసులకు పోవటం నాకు సుతరామూ యిష్టంలేదు. అదీకాక, నేను చచ్చేప్పటికి నాగురించి కంటతడిపెట్టే భార్య ఒకతుండాలని నాఆశయం. అసలు సహం అందుకే మూడోపెళ్ళి చేసుకోవాలనే ఉబలాటం." మూడోపెళ్ళి చేసుకోవాలనే కోర్కెకు ముఖ్య కారణంకూడా వివరించి, హృదయాన్ని తేలికపరచుకున్నాడు, జానకిరామయ్య.

ఆరాత్రి అప్పటికే ప్రొద్దుపోవటం మూలాన పండుకొని నిద్రపోయారు. తెల్లవారుఝామున మామూలుగా నాలుగుగంటలకే మెలకువవచ్చింది జానకిరామయ్యకు. చెప్పటం మరచిపోయాను, ఆ రాత్రి జానకిరామయ్యకు కొన్నికలలువొచ్చినవి. అందులో పెళ్ళి వైభవంగా జరిగినట్లు, పిల్లని కాపరానికి తెచ్చుకున్నట్లు — వొచ్చినకలలు జానకి

రామయ్యకు సంతోషాన్ని తెచ్చిపెట్టినయ్. మెలుకువ వొచ్చాక వాటిని మననం చేసుకోవటానికి ప్రయత్నించాడు కాని, పెళ్ళికూతురు స్ఫురణకు రావటంలేదు. ఏమైనా మళ్ళీ పెళ్ళిచేసుకోవాలనే వాంఛని ద్విగుణీకృతపరిచినయ్ ఆ కలలు. జానకిరామయ్య మరొకటికూడా ఆలోచించాడు. "ఎటుగూడీ వధువును తను వెతుక్కోవటం వసుడిలక్షణంకాదు. అందులో తనలాంటివాడికి అసలే పనికిరాదు. మరొకడు వెతికి నిర్ణయించాలి. ఈ పనిని నిర్వహించగలవాడు ఒక్క గోపాలకృష్ణయ్యే కనబడుతున్నాడు. ఎట్లాగైనాసరే, బ్రతిమాలుకొని ఈభారం గోపాలకృష్ణయ్యమీద వేస్తే అతి చాకచక్యంగా చేసుకురాగలడు. అంతకీ లొంగకపోతే ఓ వెయ్యిరూపాయలిస్తే కార్యరంగానికి పూనుకోగలడు."

తెల్లవారి గోపాలకృష్ణయ్య యింటికి వెళ్ళేందుకు ప్రయాణంకడుతూండగా,

"గోపాలకృష్ణయ్యా! నీమీద ఒక భారంమోపదలుచుకున్నాను, నేర్పుతో నిర్వహించగలవనే నమ్మకంతో." ముందరికాళ్ళకు బంధం తగిలించాడు జానకిరామయ్య. ఇటువంటి బంధాలు గోపాలకృష్ణయ్య ముందు పనికిరావు, తను యిష్టపడితేనేగాని.

"ఏమిటా భారం?" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"నిర్వహించగలనని హామీయిస్తే—"

"చెప్పూ—"

"నాకు వధువును వెతికిపెట్టాలి. ఎవరైనాసరే— నీకు నచ్చింది!" నీళ్ళు నమిలాడు జానకిరామయ్య.

"నావల్ల కాదు" అన్నాడు గోపాలకృష్ణయ్య.

"అట్లా తప్పించుకొంటే వీల్లేదు. ఎట్లానైనా సరే వధువును నిర్ణయించి వివాహం జరపవలసిందే. నీ స్నేహితుడు నిన్ను ఈ విషయంలో ఎంతో అర్ధిస్తున్నాడు. నాకు ఇంకేవరున్నారు చెప్పు" అని దీనాతిదీనంగా పలికేటప్పటికి గోపాలకృష్ణయ్యకు ఒప్పుకోక తప్పలేదు. ఆయన అంత తేలిగ్గా ఒప్పుకుంటానికి యింకో బలవత్తరమైన కారణంకూడా వుంది. అది తనవియ్యంకుడు తనకు వొప్పజెప్పిన భారం, పిల్ల పెళ్లి విషయమై.

ఎందువల్లనో పాపం, ఆ పిల్లను జానకిరామయ్యకు కుదర్చాలని అనుకోవటంలో కించిత్తుకూడా గోపాలకృష్ణయ్యకు, "ఆ పిల్ల వయస్సెక్కడ, జానకిరామయ్య వయస్సెక్కడ" అనికాని, "ఆపిల్ల భవిష్యత్తును నాశనం చేయటం ఎందుకు ?" అనికాని, "ఈ వివాహం కుదర్చటంలో లోకులేమంటారు తనని" అనికాని అనిపించలేదు.

జానకిరామయ్య చేతులో చేయి వేయించుకొని, తిరుగుడు ఖర్చులకుగాను ఓ యాభైరూపాయలు చేతిలోపెట్టి సాగనంపాడు గోపాలకృష్ణయ్యను. జానకిరామయ్య మంచి పట్టుదలకల మనిషి. ఇతర్లను నమ్మే మనిషికూడాను.

*  *  *  *  *

గోపాలకృష్ణయ్య అష్టకష్టాలుపడి చివరకు కృష్ణవేణమ్మను జానకిరామయ్యకు యిచ్చేట్టు ఒప్పించాడు. వియ్యంకుడు, వియ్యపురాలు త్వరగానే అంగీకరించారు, తమ పిల్లను యిచ్చేందుకు, పిల్లకు చాలా ఆస్తి వొస్తుందని. కృష్ణవేణమ్మ

వొప్పుకోవటమే గగనమైంది. అక్కడే గోపాలకృష్ణయ్య కొంత నేర్పునూ, నటననూ ఉపయోగించింది. కొన్ని అబద్ధాలు ఆడేందుకుకూడా జంక లేదు. "జానకిరామయ్య మహా బ్రతికితే యింకో అయిదారేళ్ళు బ్రతికేను. అప్పుడు నీవు విధవరాలు అయినా యేం యిబ్బందిలేదు. పన్నెండెకరాల ఆస్తి వొస్తుంది. తరువాత యింకో పెళ్ళి చేసుకోవచ్చు నిరభ్యంతరంగా. వెధవముండలకి పెళ్ళిళ్ళు చేసుకోవటం ఈ రోజుల్లో నాగరికమైపోయింది. ఎంతమంది విధవలు అట్లా పెళ్ళిళ్లు చేసుకోవటంలేదు కనుక." ఈ ధోరణిలో గోపాల కృష్ణయ్య కృష్ణవేణమ్మకు నీతులు గరపాడు. ఒప్పించాడు.

నిర్ణయించిన ముహూర్తానికి ముసలి జానకిరామయ్యతో కృష్ణవేణమ్మకు పెళ్ళయింది. పెళ్ళికి శుభలేఖలు అందిన బంధువులంతా రాకపోయినా పెళ్ళి సలక్షణంగానే పెద్దమనుష్యుల సమక్షంలోనే జరిగింది. కాని, పెళ్ళి రెండురోజులున్న దగ్గర్నుంచీ గోపాలకృష్ణయ్య ఈ వివాహ విషయంలో తన కే మాత్రం సంబంధం లేనట్టు నటించాడు. పెళ్ళికొచ్చిన పెద్ద మనుష్యులు అట్లా అభిప్రాయపడేట్టు ప్రవర్తించాడు. మామూలు బంధువులాగా పెళ్ళి రేపనగా తన వూరునించి వెంచేశాడు. ఈ పెళ్ళి ఆ వూళ్లో ప్రజలకు చాల ఆశ్చర్యాన్ని కలిగించింది కాని, ఎవ్వరూ తమ అభిప్రాయాన్ని వెల్లడి చేయలేదు. ముత్తైదువలూ, పడుచువాళ్ళూ ముక్కులమీద నోళ్ళమీద వేళ్లు పెట్టుకోవటమైతే పెట్టుకున్నారు కాని, చాటుగాకూడా దూషించారు కాని అనవలసిన మాటలు ముఖాన అని వేయలేదు. అది కొంత నయమే!

తరువాత, అంటే పెళ్ళయిన రెండు మూడు నెలలకి, దొంగలుపడ్డ ఆరునెలలకి కుక్కలు మొరిగినవన్నట్లు కొంత మంది కుర్రకారు గోపాలకృష్ణయ్యకు ఈ వివాహం విషయములో ఎంతవరకు సంబంధంవుందో పసికట్టి బయటపెట్టారు. ఈ పెళ్ళి కుదిర్చి జానకిరామయ్య దగ్గర్నుంచి పదిహేనువందల రూపాయలు తీసుకున్నాడనికూడా తెలిసింది.

జానకిరామయ్య తన భార్యను కాపురానికి తీసుకు వెళ్ళాడు. కృష్ణవేణమ్మ పెద్ద రూపవతికాదు గాని, అనాకారి మట్టుకు కాదు. హృదయం పువ్వుకంటె కోమలంగానూ, వెన్నకంటె మెత్తగానూ వుంటుంది. తన వివాహానికి అంతా అంగీకరించి, తన అంగీకారం ప్రస్తావన వొచ్చేటప్పటికి సాధ్యమైనంతవరకు పోట్లాడి కొంసకు "కర్మ"ను నిందించుకొని ఒప్పుకున్నది. తనకు భర్తమీద యిష్టం ఆటే లేకపోయినా జానకిరామయ్య అడుగుజాడల్లోనే నడుచుకోవటం ఉత్తమ సాధ్వి లక్షణం అని నమ్మింది.

జానకిరామయ్యకు ఇద్దరుతమ్ముళ్ళు వున్నారు. పది సంవత్సరాలుగా తమ్ముళ్ళకూ, జానకిరామయ్యకూ మాటలు లేవు. ఆ యింటిమీద కాకి యీ యింటిమీద వాలదు. పెళ్ళికికూడా జానకిరామయ్య వాళ్ళను పిలవలేదు.

మూడో భార్యయెడల జానకిరామయ్య అమిత ప్రేమ కలిగి వుంటున్నాడు. వంట చేయటానికి యిన్నాళ్ళనుంచి వుంటున్న పనిమనిషిని అట్టేపెట్టాడు.

"నువ్వేమీ పని చేయక్కర్లేదు. అన్నిపనులూ వంట చేసే మనిషే చేస్తుంది" అంటూ భార్యచేత పూచికపుల్ల

ముట్టుకోనిచ్చేవాడు కాదు. రోజూ సాయంత్రం బజార్నుంచి పూలు పట్టుకొచ్చేవాడు. "క్రొత్తభార్యకు ముసలివాడు పూలు పట్టుకెళుతున్నాడు" అని బజార్లో అరుగులమీద కూర్చున్నవాళ్లు పళ్లు యికిలించినా లక్ష్యపెట్టేవాడు కాదు.

జానకిరామయ్య పెళ్ళిలో పెట్టిన నగలేకాక, నెక్ లెస్, చంద్రహారం, రెండుజతల గాజులు కృష్ణవేణమ్మకు చేయించాడు. ఆ నగలన్నీ పెట్టుకున్నప్పుడు భార్యనుచూసి ముసలివాడు తెగ మురిసిపోయేవాడు. నిజం చెప్పొద్దూ, భార్య రతీదేవిలాగా కనపడేది ఆయనకళ్ళకు. ఖరీదుగల చీరెలు, జాకెట్టులూ తెచ్చిపడేసేవాడు, కొల్లగా.

మూడోభార్యమీద జానకిరామయ్యకు యింత ప్రేమ వున్నా మరి ఎందుకో కృష్ణవేణమ్మకు వివాహజీవితం మహా కంటకావృతంగా వుంది. "ముసిలి భర్త" అని లోలోపల అవమానపడి కుళ్లను పెంచుకొంటోంది. అదీకాక, యిరుగు పొరుగు ఆడవాళ్లు ఆమెను ఒక వింతమృగాన్ని చూసినట్లు విస్తుపోతూ చూస్తూ, చాటుగా మెటికలు విరవటం సాగించారు. అది ఆమెకు దుర్భరంగా వుంది. ఈ అసంతృప్తి, బాధ, జానకిరామయ్య నిర్మలమైన ప్రేమ గుర్తించలేనంతగా పెరిగిపోతున్నాయి. అప్పుడప్పుడూ కృష్ణయ్య వొస్తూ వుంటాడు కృష్ణవేణమ్మనూ, జానకిరామయ్యనూ చూచి పోయేందుకు. ఈ వివాహం జరిగిన తరువాత జానకిరామయ్యకు గోపాలకృష్ణయ్యమీద అంతులేని అభిమానం కలుగజొచ్చింది. నిజంగా తన క్షేమాన్ని కాంక్షించే నిర్మల మూర్తిగా కనుపించాడు. కనుక వొచ్చినప్పుడల్లా బలవంతం

మీాద వారంరోజులు అట్టేపెట్టి ఆ కబుర్లూ, ఈ కబుర్లూ, తన భార్య సంగతులూ సిగ్గూ బిడియమూ లేకుండా వల్లె వేసే వాడు. గోపాలకృష్ణయ్య జానకిరామయ్య అవివేకానికి నవ్వు కొనేవాడు. ఒకసారి గోపాలకృష్ణయ్య యింటికి వెళ్ళబోతూ కృష్ణవేణమ్మతో అన్నాడు.

"అమ్మాయీ, ఎట్లావుంది యిక్కడ?" అని.

కృష్ణవేణమ్మకు దుఃఖం పొంగి వచ్చింది. ఏడ్చింది. గోపాలకృష్ణయ్య కలవరపడ్డాడు. అయోమయంగా తోచింది. జానకిరామయ్య నిష్కల్మషుడని తెలుసు. అటువంటప్పుడు కృష్ణవేణమ్మ దుఃఖానికి కారణం?

"ఎందుకేడుస్తావు, అమ్మాయీ? నీ కేంకష్టం ఇక్కడ? జానకిరామయ్య యేమన్నా అంటున్నాడా? అలాంటి మనిషి కాదే! ఇంక నీకు కష్టంకలిగించే వాళ్లెవరున్నారు యిక్కడ?" అనడిగాడు గోపాలకృష్ణయ్య.

"నా కిక్కడ బాగుండలేదు" అన్నది కృష్ణవేణమ్మ.

గోపాలకృష్ణయ్య ఒక్క చిరునవ్వు నవ్వి, భావ గర్భితంగా,

"ఓస్. ఇంతేనా! అలవాటుపడితే అదే బాగుంటుంది. ఇంకా ఇక్కడి వాతావరణాన్ని నీవు సమగ్రంగా అర్థం చేసుకున్నట్టులేదు. ఇంకా కొన్ని రోజులు ఓపికపట్టు. జానకి రామయ్య మంచితనం తెలిసివొస్తుంది. ఇంతవరకు నీవు జానకి రామయ్య నీడనే చూస్తూవొస్తున్నావు. ఇకనించీ ఆయన హృదయాన్ని చూడు." అన్నాడు.

కృష్ణవేణమ్మకు నిజం బోధపడలేదు. మొదలకండా వూరుకుంది. గోపాలకృష్ణయ్య వెళ్లిపోయాడు.

సంవత్సరం గడిచింది—

ఈలోపల రెండుసార్లు కృష్ణవేణమ్మ పుట్టింటికొచ్చింది. జానకిరామయ్య అక్కడ వుంచకుండా వెంటనే వారంరోజుల్లో తనయింటికి తీసుకువెళ్ళేవాడు. సంవత్సరంలో అనేకమార్పులు జరిగినవి. ముఖ్యంగా కృష్ణవేణమ్మతండ్రి చనిపోయాడు, అజీర్ణవ్యాధితో. ఆయన చనిపోవటంతో ఆ కుటుంబంయొక్క బాధ్యత కొంత గోపాలకృష్ణయ్యమీద పడింది వియ్యపురాలి ప్రోత్సాహంమీద. అందుకు ప్రబలకారణం, శివరాందౌష్ట్యం, దౌర్జన్యం మితిమీరిపోవటమే. అష్ట అవలక్షణాలు అలవడి నయ్ అతగాడికి.

ప్రతిరోజు యిట్లో భార్యనీ తల్లినీ హింసిస్తున్నాడు; ఒక దొమ్మరిదాన్ని తీసుకువొచ్చి సాపిట్లో పెట్టాడు. దాని చేత భార్యనీ, తల్లినీ తిట్టిస్తున్నాడు. ఏ సంవత్సరపుపంట ధనం ఆసంవత్సరం ఖర్చుచేయటమే కాకుండా వూళ్ళో యెకరం పొలానికి సరిపోను అప్పులుచేశాడు తాగుడు నేర్చుకున్నాడు.

అల్లుడిఆగడం గోపాలకృష్ణయ్య పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ పసికట్టాడు. ముందు శివరాంని శాశ్వతంగా గుప్పెటలో యిరికించుకొని మిగిలిన వ్యవహారాన్ని నేర్పుతో ముగించాలని ఆలోచించాడు. ముక్కుకు తాడుపోసి అల్లుడిని తనగుప్పెట్లో కానీ, కూతురు హైమవతి గుప్పెటలో కానీ వుంచాలని పన్నాగం పన్నాడు. వియ్యపురాలితో సంప్రతించాడు. ఆమె గోపాలకృష్ణయ్యకి సహస్ర నమస్కారాలు

చేసి ఏవిధంగానైనా కొడుకును సక్రమమార్గంలో పెట్టనుంది. గోపాలకృష్ణయ్య శివరాంను నయాన భయాన చెప్పి చూశాడు. లాభంలేకపోయింది. గోపాలకృష్ణయ్యమీద శివరాంకు మునుపటిగౌరవం, తన చెల్లెలు పెళ్ళికి జానకి రామయ్య దగ్గర డబ్బుతీసుకున్నాడు అని రేగినపుకారుతోనే అడుగంటింది. సామాన్య మానవుల్లోని స్వార్థమే ఆయనలో కూడా వుందని నమ్మాడు. తనమామకు తనకుటుంబం మీద యేం అధికారంవుంది ? అని ప్రశ్నించుకోవటంతో, శివరాంకు గోపాలకృష్ణయ్యమీద ద్వేషం యేర్పడింది. తన కుటుంబం మీద యింతభక్తిశ్రద్ధలు దేనికి ? యేం స్వార్థం అపేక్షించాడో ? అని ఆలోచించినమీదట శివరాంకు మామమీద ద్వేషం ప్రబలింది. చాటుగా తన మామనుగూర్చి దుష్ప్రచారం చేయటం ఆరంభించాడు.

ఒకరోజున గోపాలకృష్ణయ్య శివరాంను దగ్గరుండి తప్పత్రాగించి చంద్రయ్యయింటికి తీసుకెళ్ళాడు. చంద్రయ్య దస్తావేజులు రాసేవాడు. ఒక దస్తావేజుయిచ్చి సంతకం పెట్టమన్నాడు గోపాలకృష్ణయ్య. శివరాం మాంచి నిషాలో వున్నాడు. అది దస్తావేజో, మరోకాగితమో అన్న నిజాన్ని తెలుసుకోలేని పరిస్థితిలో సంతకంచేశాడు.

అసలు రహస్యం యేమిటంటే, గోపాలకృష్ణయ్య శివరాం పొలమంతా తన కూతురుపేర వ్రాయించాడు. పాపం ! శివరాం అదేమీ కానకుండా కళ్ళుమూసుకొని సంతకంచేశాడు. ఆపైన గోపాలకృష్ణయ్య రిజిష్టరు చేయించాడు.

ఈ విషయం శివరాంకు తెలిసేప్పటికి మరోనెల గడిచింది. ఇల్లంతా నరకం చేశాడు. భార్యనుకొట్టాడు, తల్లిని కొట్టాడు, తిట్టాడు. గోపాలకృష్ణయ్యని దుయ్యబట్టాడు. "అటువంటివాడు, వాళ్ళకొంపలు తీశాడు, వీళ్ళకొంపల్లో నిప్పుపెట్టాడు" ఈ ధోరణిలో నానా విధాలుగా దూషించాడు. యేంలాభం? అయిపోయిందేదో అయిపోయింది.

తరువాత ఒకరోజున గోపాలకృష్ణయ్య శివరాంను పిలిచి పెట్టవలసిన నాలుగు చీవాట్లూపెట్టి కొసను అన్నాడు:

ఇదుగో అబ్బాయి, నీ ప్రవర్తన ఎవ్వరికీ నచ్చలేదు. వంశానికి, కుటుంబానికి అప్రతిష్ట తేవటంమాట అటుంచి, ప్రధానంగా ఆస్తినంతా ధ్వంసంచేస్తున్నావు. ఇది సహించతగ్గది కాదు. నా ఆస్తి నేను ధ్వసంచేసుకుంటే నీకు దేనికి? మట్టిపాలుచేస్తే నీకు దేనికి? అంటావేమో అట్లా వీలుపడదు. నేను నీకు కూతుర్ని యిచ్చాను, కట్నంతో. దాని బాగోగులు ఎక్కడవున్నా చూడవలసిన బాధ్యత నాపైన కూడా వుంది. అంతేకాకుండా, నీ తల్లివుంది. వీళ్ళంతా నీ అండను బ్రతకవలసినవాళ్ళే. అటువంటి పరిస్థితుల్లో పిచ్చిపిచ్చి పనులు చేసి, ధనాన్ని దుర్వ్యయం చేస్తూంటే, నాలాంటి పెద్దమనుష్యులు చేతులు నలుపుకొంటూ వుండటం మంచిది కాదు. నీ దుబారాఖర్చును అరికట్టేందుకు నిన్ను బాగు చేసేందుకు అధర్మం అని తలచకుండా కొన్ని పన్నాగాలు పన్నవలసి వొచ్చింది. ఇదంతా నీ క్షేమం నిమిత్తమేకాని నేను స్వార్థాన్నికోరి చేసిందేమీకాదు. అట్లా నీవు అన్యథా భావించినందుకు నేను విచారపడుతున్నాను. ఏదైనా

సత్కార్యం చేయ తలపెట్టినప్పుడు అనేకమంది అనేక విధాలైన విమర్శలకు గురికావల్సివస్తుంది. వీటిసన్నిటినీ లక్ష్యపెట్టనివాడే కార్యసాధకుడు."

శివరాం మాట్లాడలేదు. యేడవాలో నవ్వాలోకూడా తెలీలేదు. "గోపాలకృష్ణయ్య నేర్పరి. తన ముక్కుకు తాళ్లుపోసి తాళ్లు తనకూతురు స్వాధీనంచేశాడు" అనుకున్నాడు.

*　　*　　*　　*　　*

జానకిరామయ్యకు నెలరోజుల్నుంచీ ఉబ్బసపు రోగం అధికంగా ఉంటూన్నది. ముప్పైఅయిదవసంవత్సరంలో ఆరంభమైన ఉబ్బసపు రోగం జానకిరామయ్యలో స్థిరంగా వుండిపోయింది. ఎన్ని మందులుతిన్నా ఏంలాభం లేకపోయింది. నయంకాని రోగంగా పరిణమించింది. కాని ఆరోగంతో సంవత్సరం పొడుగునా బాధపడక్కరలేదు. అది సంవత్సరం మొత్తం మీద యే ఒకటి రెండుసార్లో వొస్తూ, వచ్చినప్పుడల్లా వారం రోజులు వుండి మనిషిని పీల్చి పిప్పిచేసిపోతూంటుంది. ఇన్ని సంవత్సరాలనించీ ఆ ప్రకారమే జరుగుతూ వొస్తున్నది. కాని గత రెండు మూడు సంవత్సరాలనించి సంవత్సరానికి మూడు నాలుగుసార్లు రావటమున్నూ, ఒచ్చినప్పుడు పదిహేనురోజులుండటమూ, మనిషిలోని సత్తువను బాత్తిగా లాగివేయటము జరుగుతూ వొస్తున్నది. ఆ సమయాల్లో జానకిరామయ్యకు బ్రతకటంపైన ఆశ నశిస్తూ భయాన్ని కలిగింపచేస్తున్నది.

ఈ తభా ఉబ్బసపు దగ్గు మహోద్ధృతంగా రావటమే కామండా-ఒకపట్టున నెలరోజులు వుండటంవల్ల జానకిరామయ్య

మరీ క్షీణించిపోయాడు. గోపాలకృష్ణయ్య ఆదుర్దానటించుతూ వొచ్చాడు. తనకు నిన్ననే తెలిసినట్టుకూడా మాట్లాడాడు.

జానకిరామయ్య మంచందగ్గర స్టూలు వేసుకు కూర్చొన్నాడు గోపాలకృష్ణయ్య. ప్రక్కనే కృష్ణవేణమ్మ భర్తకు ఉపచారాలు చేస్తూన్నది. పాపం! ఆమె నిద్రాహారాలు లేకుండా జానకిరామయ్యకు ఉపచారాలు చేస్తూన్నది. తను తృతీయ వివాహం చేసుకోవటంవల్లనే భార్యవల్ల యింతమంచి ఉపచర్యలు పొందగలుగుతున్నాడు అనుకొనేట్టు ఉపచారాలు చేస్తున్నది, కృష్ణవేణమ్మ.

"గోపాలకృష్ణయ్యా! ఇక నాకు బ్రతుకుమీద ఆశ సన్నగిల్లుతున్నది. ఏం రోగమో ఏమో. మనిషిని పీల్చి పిప్పి చేస్తున్నది" అన్నాడు బరువుగా జానకిరామయ్య.

"అట్లా నిరుత్సాహపడకూడదు, జానకిరామయ్యా. ఆయుఃపరిమాణము గట్టిగా వుండాలేగాని, ఇటువంటి రోగాలు లెక్కా? పీనుగని క్రింద పెట్టింతరువాత బ్రతికి భూమిమీద నిక్షేపంగా నివసిస్తున్నవాళ్లుకూడా వున్నారు. ఇంతకూ భూమి మీద గింజలు వుండాలేకాని..."

"అంతే నంటావా?"

"కాకమరి? నీవేమీ అధైర్యపడకు జానకిరామయ్యా! నీ కింకా భూమిమీద గింజలున్నవి. ఇంకా నాలుగు కాలాల పాటు బ్రతుకుతావు" అన్నాడు గోపాలకృష్ణయ్య, జానకిరామయ్యకు బ్రతుకుమీద ఆశని కలిగింపచేయాలనే వుద్దేశ్యంతో.

ఈ సంభాషణ జరిగిన వారంరోజులకు జానకిరామయ్య చనిపోయాడు. కర్మ యథావిధిగానే జరిపారు.

కృష్ణవేణమ్మ పుట్టింటికి వొచ్చేందుకు చుక్క ఎదురు కావటంమూలాన మూడు నెలలు అక్కడే వుండవలసివచ్చింది. గోపాలకృష్ణయ్య కృష్ణవేణమ్మకు తోడుగా హైమవతిని అక్కడకు పంపించాడు. ఇద్దరూ తోడుగా వుంటున్నారు.

ఒకరోజున కృష్ణవేణమ్మ నురిది వెంకటయ్య వచ్చాడు. అన్న చనిపోవడంతో, కర్మ విషయంలో జోక్యం కలిగించుకోవటం ఆరంభించి, తరుచు కృష్ణవేణమ్మతో మాట్లాడటం మొదలుపెట్టాడు.

బయట వరండాలోకివచ్చి పొడిదగ్గు దగ్గాడు. వంట యింట్లోంచి కృష్ణవేణమ్మ వచ్చింది.

"అమ్మాయీ" అని పిలిచాడు వెంకయ్య.

"ఏమండీ" అన్నది కృష్ణవేణమ్మ.

"ఏమీలేదు. ఇంకా నీవు యిక్కడ ఎన్నిరోజులు వుంటావని?"

ఎన్నిరోజులుంటేఏం? అనుకున్నది కృష్ణవేణమ్మ.

"ఇంకో నెల రోజులుంటాను."

"సరే, నువ్వు ఎన్నిరోజులుంటే నాకేంకాని, పొలాల కవులు రోజులు వచ్చినవిగా. నీ మనవర్తి నీకు యిచ్చి, మిగిలినపొలం మేము చేసుకోవటమో కవులుకు యిచ్చుకోవటమో జరుపుదామని" అన్నాడు వెంకయ్య అతి సహజ స్వరంతో.

కృష్ణవేణమ్మకి సురిది మాటలు అర్థంకాలేదు. తనకి మనోవర్తి యేమిటి? తన భర్తపొలం తనది. వీళ్ళకేమిటి అధికారం? వీళ్లు చేసుకొనేదేమిటి? వీళ్లు కౌలుకు యిచ్చుకొనేది యేమిటి ?

ఈ విషయం గోపాలకృష్ణయ్యకు ఉత్తరం వ్రాసింది కృష్ణవేణమ్మ. వారంరోజుల్లో గోపాలకృష్ణయ్య వచ్చాడు.

వెంకయ్యను పిలిపించాడు.

"ఏమిటి మీరు పొలం కౌలుకు యిచ్చుకొనేది. జానకిరామయ్య చనిపోతూ, భార్యపేర ఉన్న పొలమూ, యిల్లూ, రెండుదొడ్లూ వ్రాసియిచ్చాడు" అన్నాడు గోపాలకృష్ణయ్య. వెంకటయ్య స్తబ్ధుడయ్యాడు.

ఈవిషయం ఆ గ్రామంలో ఎవ్వరికీ తెలీదనే చెప్పాలి. అంత గుట్టుగా నెరవేర్చాడు గోపాలకృష్ణయ్య. రెండురోజుల్లో జానకిరామయ్య చనిపోతాడనగా, పంతులు రామకృష్ణయ్య చేత లంచం యిచ్చి త్వరగా వీలునామా వ్రాయించి, జానకిరామయ్యచేత సంతకం చేయించి, కారుమీద తీసుకువెళ్ళి రిజిష్టరు చేయించాడు. ఈ విషయం జానకిరామయ్య యిద్దరు తమ్ముళ్ళకు తెలవలేదు.

గోపాలకృష్ణయ్య వెంకటయ్యను అక్కడ నిలబెట్టి యింట్లోకివెళ్ళి వీలునామా తెచ్చి చూపించాడు. వెంకటయ్య నిలుచున్నవాడు నిలుచున్నపాళంగా నిర్విణ్ణుడయ్యాడు.

"ఈ విషయం నీకు తెలీదుగావును. అన్న బ్రతికుండగా లేనిమమత, అభిమానం చావగానే పొలంమీద వచ్చింది గాబోలు. ఈ గోపాలకృష్ణయ్య ప్రఖ్యాతి ఎటువంటిదో తెలుసా! తలుచుకున్నాడంటే అయ్యేవరకు నిద్రబోయే రకం కాదు. జానకిరామయ్యస్థిరాస్తిమీద మీకేం అధికారం లేదు."

వెంకటయ్య మారు మాట్లాడకుండా తల వంచుకుని వెళ్ళిపోయాడు. గోపాలకృష్ణయ్య విజయగర్వంగా నవ్వాడు.

గోపాలకృష్ణయ్య హైమవతినీ, కృష్ణవేణమ్మనూ, స్వగ్రామం పంపించి, తాను ఒక్క నాలుగురోజులు అక్కడే వుండి పొలమంతా కౌలుకిచ్చి, యింటిని పదిరూపాయలకు అద్దెకిచ్చి వచ్చాడు.

ఇన్ని యాతనలూ, అవస్థలూ, కుతంత్రాలూ పన్ని, కార్యసాధనలో కార్యదీక్షవహించి చివరకు విజయాన్ని పొందటంలో గోపాలకృష్ణయ్య యేమీ కించిత్తుకూడా స్వార్థం అపేక్షించలేదనటం, నమ్మతగిందికాదు. కాని అతనిలోని ప్రజ్ఞ వలన, నిష్ణాతుడు కావటంవలననూ, ఆ లోపం కనపడనీయకుండా కప్పిపుచ్చాడు. అతని స్వార్థం ఎటువంటిదో కృష్ణవేణమ్మ పుట్టింటికొచ్చిన రెండు నెలల్లో బయటపడింది.

గోపాలకృష్ణయ్య కృష్ణవేణమ్మతో అన్నాడుకదా—

"నీ పేరఉన్న పన్నెండెకరాల పొలంలో ఒక్క అయిదెకరాలు నీ అన్నకు ఇవ్వు. దాంట్లో ఒకళ్లు కోరేదేమీలేదు— నీ బుద్ధికి తోచినట్లేచేయి" అని ముందరకాళ్లకు బంధాలు వేశాడు. అట్లా అడగడంలో గోపాలకృష్ణయ్య నేర్పంతా

ఎక్కడ అంటే, "నీ బుద్ధికితోచినట్లేచేయి" అని చివరలో అనటమే.

కృష్ణవేణమ్మకు యిది సబబుగా కనిపించటానికి ప్రప్రథమ కారణం – తనకు యింత ఆస్తి వొచ్చేందుకు గోపాల కృష్ణయ్య చేసిన కృషి స్ఫురణకు రావటంవల్లనే. తల్లికూడా గోపాలకృష్ణయ్య వాదాన్ని ఆమోదించి, కృష్ణవేణమ్మకు ప్రోత్సాహం యిచ్చింది.

"సరే–" అని వొప్పుకుంది కృష్ణవేణమ్మ.

కాని యింతటితో ఆ సమస్య తీరిపోలేదు. తీరిపోనివ్వ లేదు, గోపాలకృష్ణయ్య. చతురుడుకదూ.

కృష్ణవేణమ్మ అన్న శివరాంలో యింకా పరివర్తన రాలేదు. భార్యను కొట్టి డబ్బులు తీసుకువెళుతూనే వున్నాడు. దుస్సహవాసాలు యింకా వదలలేదు. ఇటువంటి స్థితిలో గోపాలకృష్ణయ్య చెప్పిన అభ్యంతరం స్వార్థాన్ని ప్రేరేపించినా వినతగ్గది.

"సరే, అంతా బాగుంది కాని, ఈ అయిదెకరాల పొలం శివరాంకు వ్రాయటంవల్ల మనకు కలిగే వుపయోగ మేమీ లేకపోగా, అతనిమతి చెడగొట్టినట్లవుతుంది. ఎందువల్ల నంటే ఈ పొలంలోని ఆదాయంతో మితిమీరిపోవచ్చు."

గోపాలకృష్ణయ్య అన్న ఈ మాటలకు మళ్ళీ కృష్ణ వేణమ్మా, తల్లీ ఒకరిముఖాలు ఒకరు చూసుకోవాల్సిన ఆవశ్యకత యేర్పడింది.

అదను కనిపెట్టి అనేశాడు గోపాలకృష్ణయ్య :

"ఇందులో నా జోక్యమేమీ లేదు. చేయవలసిన తతంగమంతా వరుసక్రమంతప్పకుండా చాకచక్యంతో చేసుకు వచ్చాను. ఈ పరిస్థితి సంభవిస్తుందని ముందుగానే వూహించాను. అయినా ఉన్న విషయాలేమిటో వివరించాను. ఆపైన మీ యిష్టాయిష్టాలే నాకు ప్రేమితాలు."

ఆ మాటలు గోపాలకృష్ణయ్య వూహించినంతవాడిగా పనిచేసినయ్, కృష్ణవేణమ్మా వియ్యపురాలల్లో.

"సరే, నీ యిష్టంతోనే మాకు నిమిత్తం" అన్నారు.

గోపాలకృష్ణయ్య వూపిరి గాఢంగా పీల్చుకొని కర్తవ్య బోధచేశాడు :

"నాకు నా కూతురుమీదా, అల్లుడుమీదా ప్రత్యేకమైన ప్రేమలూ, మమతలూ లేవు. ఇద్దరూ ఒకటే. ఇద్దరి అభివృద్ధీ, అన్యోన్యత నా మనస్సు వాంఛిస్తుంది. అందులో ఒకరు ఎక్కువాకాదు, ఒకరు తక్కువాకాదు. కాని, అల్లుడు చెడుతిరుగుళ్లు తిరగడంవల్ల అతన్ని బాగుచేయాలనే పట్టుదల నాలో జాస్తికాసాగి ఆ పరిస్థితుల్లో ఈ పొలంకనుక శివరాం పేర వ్రాస్తే అతను పెచ్చురిల్లి మరీ అధికంగా దుస్సాహసాలు చేస్తాడనే వుద్దేశ్యంతో ఆ పొలంకాస్తా యిదివరకటిలాగానే హైమవతిపేరున వ్రాస్తే ఎప్పటికైనా ఉత్తమం అని. ఇందులో మనం పరిశీలించవలసిందిగూడా ఒకటివుంది. ముఖ్యంగా నా కూతురని స్తుతించడం కాదుగాని హైమవతిలో భర్త ఎన్ని

కొట్టినా, తిట్టినా సహించగల ఉత్తమ సాధ్వీలక్షణం వుంది. కాబట్టి పొలం అమ్మాయిపేరున వ్రాసినా మనంకానీ, శివరాంకానీ దిగులుపడవలసింది యేమీలేదు."

కృష్ణవేణమ్మా, తల్లీ గోపాలకృష్ణయ్య అభిప్రాయానికి అంగీకారం తెలిపారు.

వీలునామాలు వ్రాసే చంద్రయ్య యింటికి బయలుదేరాడు, పైపంచ భుజానవేసుకొని గోపాలకృష్ణయ్య,

